# ఆధునిక సాహిత్య విమర్శ అభిరుచి ధోరణి

## 1980-87




యం. నాగరాజు

# ఆధునిక సాహిత్య విమర్శ
# అభిరుచి ధోరణి
## (1980-87)

యువభారతి రజతోత్సవ ప్రచురణ

మోచర్ల నాగరాజు




యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
తిలక్‌రోడ్, హైదరాబాదు-500 001

ADHUNIKA SAHITYA VIMARSHA : ABHIRUCHI DHORANI
(1980-1987)
by
M. NAGARAJU


Silver Jublee Publication No. : 135

First Print : Nov. 1991

Copies : 1000

**Price 15-00**

Copies available at :

Yuvabharathi
Litarary & Cultural Organisation
Andhra Saraswatha Parishad Buildings,
Tilak Road-Hyderabad-500 001.

* M. NAGA RAJU,
H.A.L. Senior Secondary School,
Balanagar Hyderabad-42.

Printed at : Sri rajeshwari Printers, Kachiguda-Hyd.

---

తెలుగు విశ్వవిద్యాలయ ఆర్థిక సహాయంతో ప్రచురించబడింది.



సదా పలకరింపులో అభిమానాప్యాయతలను చిందించే,

సంస్కృతాంధ్ర భాషా వ్యాకరణాలను

కరతామలకంగా చేయించే-

మా మాష్టారు గారికి-

చంద్రునికో నూలుపోగు చందాన

ఈ కృతి

అంకితం

# స్వీకృతి

ఆధునిక తెలుగు సాహితీ విమర్శ ఎన్నో కొత్తపుంతలుతొక్కింది. అన్ని రంగాల్లో మాదిరిగా ఈ రంగంపై కూడా పాశ్చాత్య ప్రభావం పడి ఎన్నో కొత్త విమర్శ ధోరణులు ఏర్పడినాయి. వీటి ఆధారంగా తెలుగు సాహిత్యాన్ని కొత్త దృక్పథంతో కొత్త ప్రమాణాలతో, కొత్త పద్ధతులతో విమర్శించే అవకాశాలు కలిగినాయి. ఈ విమర్శ ధోరణుల్లో అభిరుచి విమర్శ ఒకటి. తెలుగు సాహిత్య విమర్శలో అభిరుచి ధోరణికున్న స్థానాన్ని నాగరాజుగారు ఈ గ్రంథంలో సమర్థంగా నిరూపించినారు. ఇందులో నాగరాజుగారి వ్యుత్పన్నత, విషయ పరిశీలనాశక్తి స్పష్టంగా కనిపిస్తాయి. సాహిత్య విమర్శపై ఒక మంచి గ్రంథాన్ని రచించినందుకు వారిని అభినందిస్తున్నాను.

నాగరాజుగారు నాకు విద్యార్థి. ఎమ్.ఏ. లో ఆయనకు నేను తెలుగు వ్యాకరణం, సంస్కృతం బోధించినాను. ప్రస్తుతం నా పర్యవేక్షణలోనే పి.హెచ్.డి. పట్టంకోసం పరిశోధన చేస్తున్నారు. ఈ శైష్యోపాధ్యాయికను మిషగా చేసుకొని ఆప్యాయంతో నాగరాజుగారు అంకితం చేసిన ఈ గ్రంథాన్ని కృతజ్ఞతలతో స్వీకరిస్తున్నాను.

ఆర్. శ్రీహరి




# యువ భారతి
# రజతోత్సవ సాహితి

యువభారతి 1963 లో విజయదశమినాడు ఆవిర్భవించింది. దాదాపు వెయ్యిమంది యువభారతీయుల సమైక్య సంఘటిత స్నేహశక్తి యువభారతి. సేవాభావంతో సమాజంలో ఉత్తమ సాహిత్య రసికత్వాన్ని కల్పించే సాత్త్విక చైతన్యాన్ని ఉద్యమ స్ఫూర్తితో కల్పించటం యువభారతి లక్ష్యం ఈ ఇరవై ఏళ్ళుగా యువభారతి సాహిత్యం మీద సమాజంలో ఉత్తమ విలువలు పెంపొందించింది. సహృదయ స్పందనను కలిగించే కార్యక్రమాలను చేపట్టింది. ప్రజలకు దగ్గరగా ప్రవహించే సాహిత్యాన్ని ప్రచురించింది. తెలుగువారి హృదయాలలో ఒక మరపురాని మమకారాన్ని పదిలంగా నిలుపుకొన్నది. 1990 విజయదశమినుండి 1991 విజయదశమి వరకు రజతోత్సవ కార్యక్రమాలను సముచితంగా రూపొందించుకొంటున్నది. ప్రజల నడుమ వెండి పండుగ వేడుకలు జరుపుకొనే ముచ్చటతో ముందుకు నడుస్తున్నది.

రజతోత్సవాల కాలంలో విలువైన 25 రచనలను ప్రచురించాలని యువభారతి లక్షించింది. ఇప్పటికే పదింటిని ప్రజల ముందుంచింది. ప్రతినెల మొదటి ఆదివారం సాయంకాలం "సమాలోచనం" కార్యక్రమం నిర్వహిస్తున్నది. ఆచార్య సి. నారాయణరెడ్డిగారిచేత ప్రజాచైతన్యంకలిగించే అంశాలమీద జనరంజక ఉపన్యాసాలను నిర్వహించనున్నది. విలువైన రజతోత్సవ సంచికను ప్రచురించే ప్రయత్నం సాగిస్తున్నది.

యువభారతి రజతోత్సవ సభ్యులుగా చేరండని అందరినీ ఆహ్వా నిస్తున్నాం. 1991 లో నూరు రూపాయలు చెల్లించి 1995 చివరిదాకా యువభారతి ప్రచురణలపై 40 శాతం తగ్గింపు పొందవచ్చు. దానికి రజ తోత్సవ సంచిక ఉచితం. రచయిత(త్రు)ల రచనలను "సెల్ఫ్ ఫైనాన్సింగ్ స్కీమ్" క్రింద యువభారతి ప్రచురించి, విక్రయిస్తుంది. యువభారతి మీ సహాయ సహకారాలను ఆహ్వానిస్తున్నది. రజతోత్సవాలను విజయవంతం చేయటంలో తోడ్పడండి. రజతోత్సవ కానుకగా ఈ ప్రచురణ అందుకోండి ఈ గ్రంథాన్ని రజతోత్సవ ప్రచురణగా అందించిన శ్రీ యం. నాగరాజు గారికి మా కృతజ్ఞతలు.

హైదరాబాదు
3-11-1991

జి. వి. సుబ్రహ్మణ్యం
అధ్యక్షుడు

# 'అభిరుచి' : ప్రరోచన

—డా॥ కోవెల సంపత్కుమారాచార్య

ఈనాటి మన విద్యా విధానంలో ప్రచురంగా అమల్లో ఉన్న తీరు తెన్నులను బట్టి "పరిశోధన" మార్గంలో మొదటి గుర్తింపు ఎం.ఫిల్. డిగ్రీ కాగా, ఆ తరువాతి గుర్తింపు పి.హెచ్.డి. దేని పరిమితులు ప్రమాణాలు దానికి ఉండనే ఉన్నాయి. కాగా ఈ విధమయిన గుర్తింపులను సాధించే పరిశోధన మార్గంగా ఆధునిక సాహిత్య విమర్శ రంగం మీదికి ఆహ్వానించదగిన విధంగా. ఆరోగ్యకరంగా. ఆశావహంగా ఈనాడు అభిరుచివంతమయిన యువతరం అవతరిస్తున్నది. చిరంజీవి మోచర్ల నాగరాజు ఉత్సాహం ఉరకలు వేస్తున్న ఆ యువతరానికి చెందిన క్రియాశీలి. ఆయన తన పరిశోధన కెన్నుకున్నది ఎవరో ఒక కవి, ఏదో ఒక కావ్యం, ఏదో ఒక ప్రక్రియ, యుగం వంటిది కాదు. వాటినన్నింటిని నిగ్గుతేల్చి మార్గదర్శనం చేయించే లక్షణంగల సాహిత్య విమర్శకు చెందిన ఒక అంశం ఈ విధంగా ఎన్నుకోవడంలోనే సాహిత్య విమర్శ ఆయనకు అభిరుచి విషయమని తెలుస్తూనే ఉంది. కాగా అభిరుచిమంతమయిన ఈ పరిశోధన మార్గంలో తనకు ఎం ఫిల్ డిగ్రీ సాధించి పెట్టిన ఆయన పరిశోధన పత్రం ఈ "ఆధునిక సాహిత్య విమర్శ : అభిరుచి ధోరణి" సమకాలీనంగా సాగుతున్న సాహిత్య విమర్శ విధానంలో ఒక తరహాను దాని స్వరూప స్వభావం విశ్లేషణతో రూపు కట్టించేందుకు సాభినివేశంగా నాగరాజు చేసిన పరిశ్రమా పయత్నమూ ఈ పరిశోధన పత్రంలో ఆద్యంతమూ అభివ్యక్తమవుతున్నాయి.

సాహిత్యం ప్రాచీనమూ కావచ్చు, అధునాతనమూ కావచ్చు, ఏదయినా సరే. దాన్ని విమర్శించే తీరులో వ్యక్తమయ్యే ఆధునికతను" బట్టి విమర్శను ఆధునిక సాహిత్య విమర్శ అంటున్నాం కాని, ఆ "అధునికత్వ"మనేది దేశీయ భూమిక మీద గాక పాశ్చాత్య సాహిత్య విమర్శ రీతుల ప్రభావ పరిధుల భూమిక మీదనే, ప్రస్తుతానికి, సాధారణంగా గుర్తించబడు తున్నది. అంటే పాశ్చాత్య సాహిత్యంలోను; దాన్ని అనుసరించి కొన్ని సందర్భాల్లో అధిగమించిగూడా, పాశ్చాత్య విమర్శలోనూ వచ్చిన వస్తూ, పోతూ ఉండిన రకరకాల వాదాలూ, పద్ధతులూ, ధోరణులూ, మనసాహిత్యం, లోకి సాహిత్య విమర్శలోకీ దిగుమతిఅవుతూ ఉండడం "సర్వసాధారణ"మై పోయినప్పటి నుంచి "అధునికత్వమని'' భావించడం గూడా సర్వసాధారణ మయిపోయింది. మనకవసరమయి గూడా, మనకు లేని వాటిని, మనం తయారు చేసుకోలేనంతలావుంటే, వాటిని అవసరంలోని తీవ్రస్థాయీ భేదాన్ని బట్టి 'దిగుమతి' చేసుకోవడమనేది కొన్ని కొన్ని ప్రత్యేక సందర్భాల్లో అంగీకరించదగిందయితే కావచ్చు నిజానికి మన కవసరమయినవి మన తీరులో, మన కనువయిన విధానంలో రూపొందించుకోవటం, తయారు చేసుకోవట మనేది కేవలం దేశపు రాజకీయార్థికాది విషయాల్లో మాత్రమే. కాదు సాహిత్య విషయంలోనూ ఉత్తమమయిన, అభ్యుదయకరమైన విధానం అయితే, "అభిరుచి" అన్న ముద్రలో మాత్రమే మోజుపడి, సరదా పడి దిగుమతిచేసుకోవటం కొన్ని సందర్భాల్లో స్మగుల్ చేసుకోవటం కూడా ఈనాడు విరివిగా కనిపిస్తున్నది. (విడి భాగాలు దిగుమతి చేసుకొని మన ముద్రను వేయటం గూడా లేకపోలేదు) కాగా ప్రస్తుతానికి ఈ 'అభిరుచి విమర్శ" అనేది గూడా ఇంచుమించుగా ఆ కోవకు చెందినదే.

"నేటి తెలుగు సాహిత్య విమర్శలో 'Impressionistic Criticism' కు సమానార్థకంగా "అభిరుచి విమర్శ" అని ప్రయోగిస్తున్నారు" (పు. 4) అంటూ నాగరాజు ఈ విషయాన్ని స్పష్టంగానే చెప్పారు. ఆయన తన పరిశోధన పత్రం మొదటి అధ్యాయంలో, "ఆంగ్ల సాహిత్య విమర్శ :

అభిరుచి విమర్శ" అంటూ రాసిన మూడవ అధికరణం ఈ అంశాన్నే వివరిస్తుంది.

ఆంగ్ల సాహిత్య విమర్శలో ఇరవయ్యో శతాబ్దపు తొలి నాళ్ళలో అంతో ఇంతో గుర్తింపు సంపాదించిన Impression అనేది సాహిత్యంలో ఒక "వాదం" (Ism) గాను, సాహిత్య విమర్శలో ఒక పద్ధతి (Method) గాను ఉండింది (పు 4) స్పష్టపరుతుంది. అదట్లా ఉంచి, నిజానికి Impression అనే దానికి "అభిరుచి'' అనేది అచ్చంగా భాషాపర్యాయపదం కాదు. మూల తాత్పర్యం స్ఫురిస్తుందనే తాత్పర్యంలో అది తెలుగుసాహిత్య విమర్శ రంగాన అమల్లోకి వచ్చింది. అందుకే నాగరాజు "సమానార్థకం" అని "ప్రయోగిస్తున్నారు" అని జాగ్రత్త పడ్డట్టు కన్పిస్తుంది. ఏదో విధంగా అమల్లోకి వచ్చింది కాబట్టి దాని స్వరూప స్వభావాలను నిరూపించుకోవాల్సిన అవసరంగా నాగరాజు ముందుకు వచ్చారు. మరొకటి : పద్ధతిలో పదిమందికి అంగీకార్యం కాదగిన ఒకానొక శాస్త్రీయ లక్షణం 'ధోరణి'లో కన్నా అధికంగా ఉంటుంది. "అభిరుచి" పద్ధతి అని గాక 'ధోరణి' అనటం ద్వారా దాని పరిమితులను నాగరాజు ఉద్దేశించాడేమో ననిపిస్తుంది. ఆయన సాగించిన విచారణ, విశ్లేషణలకు ఈ 'ధోరణి' అనువుగా అనువర్తించింది. ఇంకొకటి : ఈ ధోరణిని నాగరాజు 'మనది'గా చేసేందుకు ప్రయత్నించిన తీరు 'ఆంధ్రాంగ్ల సాహిత్య విమర్శల్లో అభిరుచి ప్రవృత్తి' అనే అధికరణం (మొదటి అధ్యాయం)లోనూ, ఆ తరువాతి అధ్యాయాల్లోనూ కన్పిస్తుంది. అదట్లా ఉంచి-

సాహిత్య విమర్శకు సంబంధించి అభిరుచి అనేటప్పటికి నాకు దేశీయ సాహిత్య విమర్శ మార్గంలో పరమ ప్రామాణికుడయిన ఆనంద వర్ధనుడు గుర్తుకువస్తాడు. ప్రపంచంలోని సర్వవిషయాలనూ, కావ్యవస్తువులుగా, కావ్యాంగాలుగా కవి ఎట్లా మలచుకొంటాడనే అంశాన్ని వివరించే సందర్భంలో-

అపారే కావ్య సంసారే, కవిరేకః ప్రజాపతిః

యథా స్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే"

(ధ్వన్యాలోకం మూడవ ఉద్ద్యోతం నలభై రెండవ కారికా వృత్తిలో) అని ఆనందవర్ధను డన్నాడు. ఈ సంసారం-ప్రపంచం వాఙ్మయంగా ప్రవర్తిస్తే అది కావ్యసంసారం-ప్రపంచ సాహిత్యమవుతుంది. అదిఅపార మయింది. అపారమయిన కావ్య సంసారంలో కవి మాత్రమే ప్రజాపతి. (బ్రహ్మవేరు. ప్రజాపతి వేరు. ఆనంద వర్ధనుడు కవిని ప్రజాపతి అనటం ప్రత్యేకంగా గుర్తించవలసిన అంశం). ఆ విధమయిన కవికి ఈ విశ్వం-చరాచర ప్రపంచం ఏ విధంగా రుచిస్తుందో (రోచతే) ఆ విధంగానే అది కావ్య సంసారంగా ప్రవర్తిసమవుతుందని తాత్పర్యం, కవికి రుచించడం అనే అంశాన్ని ఆనందవర్ధనుడు ప్రధానీకరించాడు. ధ్వన్యాలోక లోచన వ్యాఖ్యానంలో అభినవగుప్తుడు ఈ సందర్భంలో— 'యథారుచి' (రుచి ఎట్లాంటిదయితే అట్లా రుచిని అనుసరించి) అన్నాడు. కాగా కావ్యం రూపొం దటంలో కావ్యంలో వివిధ విషయాలు ప్రవేశించటంలో అభివ్యక్తం కావ టంలో కవియొక్క అభిరుచి ప్రధానమవుతున్నది. అయితే కవి మాదిరి గానే కావ్య శ్రోతకు పాఠకుడికి కూడా 'రుచి' అనేది ఉండనే ఉంటుంది. మరి, ఒక కావ్యాన్ని చదువుతున్నప్పుడు కావ్యంగా పరిణమించిన కవి యొక్క రుచికి పాఠకుడి యొక్క రుచి అభిముఖంగా ప్రవర్తించినప్పుడు పాఠకుడికి ఆ కావ్యానుభవం సమగ్రంగా కలుగుతుంది. కాగా కవికి సంబంధించింది 'రుచి' దానికి కావ్య పాఠకుడి వైపునుంచి కావలసింది అభిరుచి.

"యదభి ముఖముగఁ జెప్పిరో యల్లదానిఁ

దదభిఁ ముఖముగఁ జూచిన ధర్మ మొప్పు:

న పముఖంబుగఁ జూచిన నఖిల దోష

కలితముగఁ దోచుధర్మ సంఘాత మెల్ల"

విశ్వనాథ సత్యనారాయణ : రామాయణ కల్పవృక్షం : అయోధ్య : పాదూ : 412) ధర్మ విషయంగా చెప్పబడిన ఈ అంశాన్ని ప్రస్తుతానికి సాహిత్య విషయంగా గూడా అనువర్తింపజేసుకోవచ్చు. పాఠకుడియొక్క రుచి కవియొక్క రుచికి అభిముఖంగా ప్రవర్తించినప్పుడే కావ్యసౌందర్యం పాఠకుడికి సరయిన విధంగా సమగ్రంగా అభివ్యక్తమవుతుంది. మరి అభిముఖంగా కాక అపముఖంగా ప్రవర్తించేటట్టయితే అభివ్యక్తమయ్యేదికూడా అపముఖంగానే ఉంటుంది అసలు కవి సౌందర్యంగానే అనిపించకపోవచ్చు గూడా కాగా-

“కవి తన రుచిని ప్రకటిస్తే విమర్శకుడు తనదయిన అభిరుచిని వ్యక్తీకరిస్తాడు. కావ్యసౌందర్య దర్శనంలో కవి- విమర్శకులు ఒకే కేంద్రం దగ్గర నిలుస్తారు. (పు.4) అనీ- “కవి విమర్శకులు వైయక్తిక దృక్పథాలు కలవారయితే, ఇద్దరి అభిరుచులు సంవదించకపోతే విమర్శ దూషణగా మారుతుంది (పు.71) అనీ నాగరాజు అనటంలో ఈ అభిజ్ఞస్ఫురిస్తుంది. అభినవగుప్తుడు లోచన వ్యాఖ్యానారంభంలో-సరస్వత్యాస్తత్వం కవి సహృదయాఖ్యం విజయతే' అనటాన్ని లోతుగాను, విస్తృతంగాను అవగాహనపరచుకొంటే ఈ విషయం మరింత స్పష్టమవుతుంది. “సహృదయుడ”డంటే కావ్య పాఠకుడు. కవితో సమాన హృదయం గలవాడు. అప్పుడే కవియొక్క హృదయం మొదలైనవి కావ్య పాఠకుడిలో సరిగాఅభివ్యక్తమవుతాయి. కాగా, సహృదయ పదం కావ్య పాఠకుడియొక్క కావ్య పఠన యోగ్యతా స్థితిని సూచిస్తుంది. కాగా, కేవలం కవి పాఠకుల వరకే పరిమితం చేయకుండా ఈ అంశాన్ని కావ్య నాయకుడి దాకా గూడా విస్తరింపజేస్తూ- “నాయకస్య కవేః శ్రోతుః” అని భట్టతౌతుడన్నాడు. ఈ విధంగా భారతీయాలంకారికులు రుచి, దాని కవసరంగా పాఠకపరమైన అభిముఖ్యాన్ని రకరకాలుగా వివిధ కోణాలనుంచి భావించారు. అదట్లా ఉండగా; కావ్య పాఠకుడు కవితో సమాన ధర్ముడు కావాలని భవభూతివంటి కవులు కోరుకొనటం కూడా మరొక పద్ధతిలో ఇదే అంశాన్ని వ్యక్తీకరిస్తుంది.

ఇంతకీ; కవికి గాని పాఠకుడికి గాని రుచి లేదా అభిరుచిఅనేది ఎట్లా ఏర్పడుతుంది అదిఅచ్చంగాసహజాతమా?తుమ్మపూడికోటేశ్వరరావు అన్నట్లు "వ్యక్తి పుట్టి పెరిగిన వాతావరణం, సాంఘిక, దేశీయ, జాతీయ, కుటుంబ సంప్రదాయాలనుండి నిష్పన్నమవుతుంది'' (పుట౫). వీటన్నిటితోపాటు అంది వచ్చిన సాహిత్యాభ్యసనం గూడా ప్రస్తుత విషయంలో తోడవుతుంది. నిజానికి కొంత నిదానంగా గమనిస్తే, వ్యక్తుల విషయంలో మాదిరిగానే ఒక జాతికి ఒక దేశానికి గూడా ఆ జాతి దేశ పారంపరిక సంప్రదాయం భూమికగా అన్ని విషయాలలో మాదిరిగానే సౌందర్య సాహిత్యవిషయాలకు సంబంధించి గూడా ఒక సామూహిక సార్వజనీనమైన రుచి, అభిరుచి ఉంటుంది; వైయక్తిక, సామూహిక చైతన్యాల ప్రవృత్తిగా ఇది వర్తిసుంది. ఈ కారణంగానే వ్యక్తుల రుచి-అభిరుచులు ఈ సామూహికాదిక మయిన రుచి-అభిరుచుల విశాల పరిధిలోనే మౌలికంగా ఇమిడిపోతాయి. అందుకే దేశీయ, జాతీయ విషయాలలో సులభంగా అమరటానికి వీలవుతుంది. అయితే వైయక్తికంగా భాసించే చిన్న చిన్న తేడాలు సామాన్య విమర్శలో వివిధ కోణాలనుంచి ప్రవర్తించే వివిధ సిద్ధాంతాలకు, వాదాలకూ, సమన్వయాలకు సూత్రీకరణలకూ అవకాశం కలిగిస్తూ ఉంటాయి. అయినా సార్వత్రికంగా దేశీయ రుచి-అభిరుచి వీటన్నింటికి భూమికనే ఉంటుంది. ఇదిట్లా ఉండగా-

ఒక కావ్యం గురించి గాని, ఒక సాహిత్య విషయం గురించిగాని పాఠకుడు వెలువరించే అభిప్రాయాలు, ప్రధానంగా 'అభిప్రాయాలు'గానే ఉండిపోతాయి. వైయక్తిక పరిధిని దాటవు. అయితే పాఠకుడు తన ఈ కేవల పాఠకత్వ పరిధిని అధిగమించి ఇతరుల అభిప్రాయాలను, అభిరుచి అనుభవాలను గూడా పరిగణనం లోకి తీసుకొని సామూహికాభిరుచి-అనుభవ భూమికపయి విచారించటం, విశ్లేషించటం మొదలుపెట్టినప్పటి నుంచి 'విమర్శ' ఆవిష్కృతమవుతూ ఉంటుంది. కాగా, కేవల పాఠకత్వ పరిధికన్నా విమర్శకత్వపరిధి చాలా విస్తృతం మాత్రమేకాదు:బాధ్యతాయుత మయింది గూడా. పాఠకుడు అభిప్రాయాలను అలవోకగా వెలువరించ

గావచ్చు. కాని విమర్శకుడు ఆ విధంగా చేయడానికి వీలులేదు. విమర్శ లక్షణం అందుకు నందివ్వదు. అందుకని విమర్శకుడు అలవోకగా నిర్లిప్తంగా వినరటంగాక, వాటికి తాను పరిగణనంలోకి తీసుకొన్న వాటికి ఒక సమష్టి భూమికను రూపొందించి సంయుక్తకంగా విచారణ, విశ్లేషణ విధానాన్ని అనువర్తింపజేస్తాడు. ఈ అనువర్తింపజేసే సందర్భంలో ఆ అనువర్తింపు లోని గాఢత్వ, స్థాయీ భేదాలను బట్టి విమర్శకుడి అభిరుచి మార్పులో, ఘనిష్ఠతలో వచ్చే అవకాశం లేకపోలేదు. తద్వార విమర్శ పాఠకుల అభిరుచి, ఆలోచనను గూడా పరిష్కరించవచ్చు. కాగా విమర్శకుడి అభిరుచి ఏదో ఒక కావ్యానికి, సాహిత్య విషయానికి అని పరిమితం కాక సాహిత్యం మొత్తానికి సంబంధించిన అభిరుచిగా ఎదుగుతుంది, విస్తరిస్తుంది. ఆ స్థాయినుంచి కావ్యాదులను గమనించడం సాగుతుంది. ఈ సందర్భం లోనే విమర్శకుడి ప్రతిభావ్యుత్పత్తులు యదార్థంగా వాటి వాటి స్థాయిల్లో పనిచేయటం ఆరంభిస్తాయి. ఈ ప్రతిభావ్యుత్పత్తిమయంగా ఎదిగిన, విస్తరించిన తీరునుబట్టి విమర్శలో సృజనాత్మకత ఆవిర్భవిస్తుంది. శాస్త్రీయత ఒక సిద్ధాంతమో, సమన్వయమో, సూత్రమో ఆవిష్కృతమవుతుంది. ఈ సందర్భంలో మళ్ళీ ఆనంద వర్ధనుని మాటలనే ఉటంకించుకోవచ్చు ధ్వన్యాలోకంలో చివర ఆయన ఇట్లా అన్నాడు-

సత్కావ్య తత్త్వ నయవర్త్మ చిరప్రసుప్త
కల్పంమనస్సు పరిపక్వధియాం యదాసీత్
తత్ వ్యాకరోత్ సహృదయోదయ లాభ హేతోః
ఆనంద వర్ధన ఇతి ప్రథితాభి దానః

సత్కావ్య తత్త్వానికి సంబంధించి పరిణత బద్ధులయిన వారి, అంటే సహృదయ పాఠకుల మనస్సుల్లో అనేకమయిన అభిప్రాయాలు ఏర్పడి ఉన్నాయి. అవన్నీ చెదురుమదురుగా వ్యక్తమవుతూ ఉండటం వల్ల నిక్షిప్తంగానే ఉండిపోయినాయి. అంటే ఒక విధంగా చెబితే కావ్యతత్త్వ నిక్షిప్తత వల్ల కావచ్చు. "సుప్తకల్పం''గానే తప్ప "సుప్తం"గా మాత్రం కాదు. ఒక విధమయిన స్ఫూర్తికి దారి తీస్తున్నట్లుగానే ఉన్నాయి. కాని దారి

స్పష్టపడటం లేదు. వాటన్నింటికి విశ్లేషణ పూర్వకమయిన శాస్త్రసమన్వయ రూపం సిద్ధించకపోవటం వల్లనే కావ్యతత్త్వం సుప్తకల్పంగా ఉండటానికి కారణం. వారి, తన రకారకాలయిన అభిప్రాయాలు, అభిరుచుల విశ్లేషణ పూర్వకమయిన విచారణగా ఆనంద వర్ధనుడిలో ఒక సమన్వయం ఆ ష్కృతమయింది దాన్ని వ్యాకరించి, అంటే, దానికి శాస్త్రీయతను సాధించి, ప్రదర్శించి, సైద్ధాంతిక ప్రామాణికతను సాధించాడు అయన సిద్ధాంతానికి కుదురుకొన్న భూమిక కలిగిన శాస్త్రీయత. ప్రామాణికత కారణంగానే ఆయన ప్రామాణికుడయినాడు ఈ సందర్భంలో ఒక అంశం ప్రధానంగా గమనించవలసి ఉన్నది. భారతీయాలంకారికులు వారేకాదు దేశీయ సైద్ధాంతికులు మరెవరయినా గూడా, ఫలానా సిద్ధాంతం తమ సిద్ధాంతం "స్వంత సృష్టి" అని భావించినట్టు ఎక్కడా కన్పించదు. తమ దాకా పారంపరికంగా అంది వచ్చిన రకరకాల భావాల, విషయాల, అనుభవాల సామూహిక చర్యగా తమకు కలిగిన వాటి విశ్లేషణపూర్వక మయిన విచారణ ఫలితంగా ఆవిష్కృత మయిన దాన్ని వ్యక్తీకరించటం గానే భావించారు.

అవలోక మతా౯ సత్కవీనాం
అవగమ్య స్వధియాచ కావ్యలక్ష్మ
సుజనావ గమాయ భామహేన
గ్రధితం రుక్మిల గోమి సూనునేదమ్

ఆని తొలి అలంకారికుడయిన భామహుడు తన "కావ్యాలంకారం" చివర పయి విధంగా అన్నాడు. (భామహుడు "సత్కవి" అనటం, ఆనంద వర్ధనుడు "సత్కావ్య" మనటం గుర్తించదగిన అంశం) కాగా, వారందరూ వైయక్తిక పరిధులకే పరిమితం కాకుండా సామూహికత్వంకి, సమష్టి తాత్పర్యంలోకి విస్తరించారు అందువల్లనే వారి వారి అభిప్రాయాలూ, సమన్వయాలూ, సిద్ధాంతాలూ ప్రామాణికత్వాన్ని సంతరించుకొన్నాయి. కాగా, ఈ నేపథ్యంలో-

"విశ్వజనీనత పొందని వ్యక్తిగత అభిప్రాయాలు ఇష్టాయిష్టాల (?) నిండిన సిద్ధాంతాలు అభిరుచి విమర్శగా పరిగణింపబడవు" (పుట. 11).

ఆ నాగరాజు అనటంలోని ఔచిత్యాన్ని గుర్తించవచ్చు. నిజానికి, వైయక్తికమయిన ఇష్టానిష్టాలనేవి అసలు "విమర్శ" పరిధిలోకే రావు. విమర్శ రంగం మీదికి వచ్చాక ఈ ఇష్టానిష్టాల ప్రభావరేఖలెట్లా ఉన్నా అవన్ని గౌణమయిపోయి శాస్త్రీయమయిన ఆలోచనా విధానంమాత్రమే ప్రధానమవుతుంది.

"విమర్శన పద్ధతి ఏదయినా శాస్త్రీయత తప్పని- సరిగాఉంటుంది. స్వీయాభిరుచి కప్పిపుచ్చాలని ఎంత ప్రయత్నించినా విమర్శలో మౌలికంగా ఆత్మాశ్రయత చోటూచేసుకొంటూ విమర్శలో నవ్య లక్షణాలను, సమన్వయాలను చేస్తూ అభిరుచి విమర్శ విధానం రూపొందుతోంది (పు. 4) అంటాడు

నాగరాజు, నిజానికి విమర్శకుడు "స్వీయాభిరుచిని కప్పిపుచ్చాలని" ప్రయత్నించనక్కరలేదు. అయితే సరయిన విమర్శన పద్ధతి అవలంభించబడితే, అంటే, శాస్త్రీయత అనుసరించబడితే సాగే విశ్లేషణ స్వీయాభిరుచిని పరిష్కరిస్తుంది. ఈ పరిష్కృతమయిన అభిరుచి నుంచే నవ్యలక్షణాలూ, సమన్వయాలూ కుదురుకొంటాయి. మరి అపరిష్కృతంగా ఉండేట్టయితే ? అభిరుచిని భూమికగా చేసుకొని ముందుకు సాగుతున్న నాగరాజు ఈ పరిస్థితిని గమనించే కావచ్చు అబిరుచి విమర్శకు రెండు కోణాలున్నాయని గుర్తించవలసి వచ్చింది.

"సృజనాత్మకతలో గూడి స్వీయ ప్రతిపాదనలతో, శాస్త్రీయతతో సాగేది ఒకటి. వస్తువుతో సంబంధంతెగిపోతూ ఊహాగానాలు ప్రశంసాదూషణలు అధికమయిన అశాస్త్రీయ ధోరణి రెండవదిగా కనిపిస్తుంది. (పు. 12)

అన్నాడాయన. అబిరుచి విమర్శగా పరిగణింపబడవు అని పైన చెప్పిన అంశమే ఈ రెండవ కోణం. ఇది అశాస్త్రీయమనగా అంశాన్ని నాగరాజు స్పష్టంగానే గుర్తించాడు. ఈ గుర్తింపే అభిరుచి విమర్శ ను మూడు విధాలుగా వర్గీకరించటంలో ఆయనకు ఉపకరించింది వ్యక్తిగత-ప్రయో

గాత్మక, ప్రామాణిక భేదాలతో ఆ వర్గీకరణ సాగింది. ఒక్కొక్క భేదంలో కొన్ని కొన్ని ఉపాంశాలు కూడా అయా అభిరుచి ప్రసార రీతిని సూచించే విధంగా ప్రదర్శింపబడ్డాయి. వ్యక్తిగత అభిరుచి విమర్శ సాగే పాక్షకత్వాదికమయిన అయిదంశాలూ ఆ విమర్శ యొక్క ఆ విమర్శత్వాన్నే నిరూపిస్తాయి. మిగిలిన రెండింటిలో విమర్శ లక్షణ క్రమ వికాసం స్ఫురిస్తుంది. ప్రయోగాత్మకమన్నది ప్రామాణిక మన్నదానికి మొదటి మెట్టు. ఈ రెండూ విమర్శ కావటాన్ని మొదటిది వ్యతిరేకముఖంగా నిరూపిస్తుంది. ఈ పరిశోధన పత్రంలో మూడింట రెండు వంతులుగా విస్తరించిన మూడవ అధ్యాయం ఈ మూడు విధాల అభిరుచి విమర్శ సాగేతీరు తెన్నులు మొత్తం పదిహేడింటిని సోదాహరణంగా వివేచించింది మొదటి రెండధ్యాయాలు ప్రధానమయిన ఈ మూడవ అధ్యాయానికి సైద్ధాంతిక ప్రాతిపదిక సమకూర్చే విధంగా సాగినాయి. 1980 నుంచి 1987 వరకు-అంటే, ఎనిమిది సంవత్సరాల కాలంలో తెలుగు సాహిత్య విమర్శలో సాగిన అభిరుచి లక్షణాన్ని విశ్లేషించిన ఈ మూడవ అధ్యాయం విషయ సేకరణలో ప్రస్తుతీకరణలో నాగరాజు పరిశ్రమనూ, లక్ష్యాన్నిస్పష్టంగావ్యక్తీకరిస్తుంది అయితే తానురూపొందించుకొన్నకాలపరిమితికి కారణాలను ఈఅధ్యాయం మొదట్లోనే వ్యక్తీకరిస్తే బావుండేది· రెండవ అధ్యాయంలో ఈ అభిరుచి విమర్శ ఆధునికంగా ప్రాథమిక-పరిణామ-పరిణతి-ప్రయోగ- మిశ్రదశలుగా ప్రవర్తించిందని వీటి తీరు తెన్నులను ఆయన ప్రదర్శించాడు నాగరాజుఎన్నుకొన్న ఈ పరిమిత కాలం మిశ్ర దశకు సంబంధించింది. ఈ మిశ్రదశ పూర్వదశలను తనలో పొదువుకొంటూ ఉండటం ఆ పరిమితికి కారణం కావచ్చు. ఈ అయిదు దశలనూ నాగరాజు తీర్చిన తీర్పు ఆధునిక సాహిత్య విమర్శ మొత్తమూ అభిరుచి విమర్శ అన్న స్ఫూర్తి కలిగించటానికి వీలయిన విధంగా ప్రవర్తించింది. అంతేకాదు. ఇంప్రెషనిస్టిక్ క్రిటిసిజాన్ని దేశీయాకరించే తీరుకూడా వ్యక్తమవుతుంది ఒకచోట "దేశీయత పునాదిగా కల్గి అభిరుచి విమర్శ ప్రత్యేకతను సంతరించుకుంది. (పుట. 10) అని అన్నాడు కాగా-

మొత్తంమీద; వలసినంత సమాచారాన్ని సేకరించి తగినంతగా ఏర్పరచిన భూమికపై ఆధునిక సాహిత్య విమర్శలో "అభిరుచి ధోరణిని" బహిరంగ విచారణకు నాగరాజు నిలబెట్టి తన విశ్లేషణనుస్పష్టంగా ప్రస్తుతీకరించాడు. విమర్శకుల స్పందనలకోసం ఎదురుచూస్తున్నాడు. ఒక విమర్శ ధోరణి యొక్క నిగ్గు తేల్చేందుకుగాను చక్కని ప్రాతిపదికను సమకూర్చినందుకు నాగరాజును అభినందిస్తున్నాను.

ఈ పరిశోధన పత్రంలో వ్యక్తమయ్యే లక్ష్య నిర్ణయ విధానం, పరిశ్రమ చిరంజీవి నాగరాజు మున్ముందు సాగించే పరిశోధన, విమర్శ పరిష్కృత సత్ఫలితాలను సాధించగలవనే ఆశ కలిగిస్తున్నాయి. ఆ ఆశను తీర్చే బాధ్యతను నాగరాజుపై నిర్ధారిస్తూ సాహిత్య విమర్శలో అభిరుచి మంతులను గ్రంథ విషయంలోకి సాదారంగా ఆహ్వానిస్తున్నాను. చిరంజీవి నాగరాజు కోరేది గూడా అదే.

-o- శుభమ్ -o-

# అభిరుచికి నవరుచి

—ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం

డీన్ స్కూల్ ఆఫ్ హ్యూమానిటీస్

హైదరాబాదు విశ్వవిద్యాలయం

ఏ సాహిత్యంలోనైనా ఒక క్రొత్త ధోరణి ఒక దేశీయమైన అవసరంతో పోతుంది దానికి ప్రేరణ తోడౌతుంది. ఆధునికాంధ్ర సాహిత్యంలో కవితా వికాస చరిత్రను పరిశీలించినా, సాహిత్య విమర్శ పరిణామాన్ని సమీక్షించినా ప్రేరణలు కొన్ని బలమైనవి, పాశ్చాత్య సాహిత్య పఠన వలన తెలుగు కవులకు, విమర్శకులకు కలిగిన వాటిని స్వీకరించటంలోను, నిర్వహించటంలోను దేశీయత అవసరాలను దృష్టిలో పెట్టుకొని సాగించినట్లు కనబడుతుంది. ఆధునిక సాహిత్యవిమర్శ ధోరణులలో అభిరుచిధోరణి అటువంటి వాటిల్లో ఒకటి.

వీరేశలింగం పంతులు గారి వరకు అభిరుచి ధోరణి సాహిత్య విమర్శలో ఉన్నదని నిరూపించలేంగాని, ఉన్నట్లు ఊహించడానికి కావ్యాపతారికలోని పద్యాలు కొన్ని చాటువులు ఆధారాలుగా కనబడుతున్నాయి. కాని ఆధునిక విమర్శలో మాత్రం అభిరుచి విమర్శ ఆకృతి తాల్చింది. అభివృద్ధి చెందింది, ప్రయోగాలను నిర్వహించింది, ప్రయోజనాలను సాధించింది

ఈనాడు తెలుగు విమర్శకులలో రెండు రకాలుగా ఆలోచించేవారు ఉన్నారు. 1 ఆధునిక సాహిత్య విమర్శ ప్రయోగాలని పాశ్చాత్య విమర్శ ప్రయోగాలకు ప్రతిబింబాలే అని భావించేవారు. ఈ తెగవారు ఆంగ్ల సాహిత్య విమర్శ వికాసాన్ని ఆధారంగాచేసుకొని ఆంధ్రసాహిత్య విమర్శ పరిణామగతులను, పారిభాషిక పదాలను వ్యాఖ్యానించవలసి వచ్చినా, విశ్లేసించవలసి వచ్చినా, నిర్వచించవలసివచ్చినా, నిరూపించవలసి వచ్చినా, ప్రభావ పద్ధతినకాక, దేశీయతా సూత్రాన్నే అనుసరించవలసి వస్తుంది. రెండవ తెగవారు తెలుగు సాహిత్య అస్తిత్వాన్ని, వికాసాన్ని దేశీయతా సూత్రంతో దర్శించడానికి ప్రయత్నం చేస్తారు. ఈ రెండు రెండు చూపులు. ఈనాడు ఏ విమర్శను చదివినా ఆ విమర్శకుడు ఏ చూపుతో విమర్శ చేస్తున్నాడన్నది ముందుగా పరిగణింపవలసి వస్తోన్నది.

మిత్రులు చి॥ మోచర్ల నాగరాజు ఎం. ఏ, లో చేరిన నాటి నుండి సాహిత్య విమర్శ మీద ఒక ప్రత్యేకమైన అభిమానాన్ని చూపిస్తుండేవాడు. 'ఆధునిక సాహిత్య విమర్శలో అభిరుచి ధోరణి' గురించి పరిశోధన చేయాలన్న ఆసక్తిని పెంచుకొన్నాడు. అయితే "అభిరుచి ధోరణి" అన్న పారిభాషిక పదం ఇంగ్లీషులో Impressionistic criticism అనే పదానికి తెలుగు రూపంగా వారు గ్రహించారు. ఎందువల్లనంటే తెలుగు విమర్శకులు ఆ పరిభాషిక పదాన్ని ఆ అర్థంలో రూఢికెక్కించారుకాబట్టి. పరిభాషిక పదం నాగరాజుగారికి తానెన్నుకున్న ధోరణియొక్క స్వరూప స్వభావాలను ప్రసార పరిధులను నిర్ణయించుకోవడానికి బాగా సహకరించింది. అభిరుచి విమర్శ పేరుతో సాగిన విమర్శకుల వివేచనను విశ్లేషించడానికి వివరించటానికి తోడ్పడింది.

అయితే నాగరాజుగారు చేసిన పరిశోధన విమర్శ ధోరనిమీద ఒక నవ్యాలోకం. అంటే తెలుగులో అభిరుచి ధోరణి, ఇంగ్లీషు విమర్శధోరణితో మాత్రమే చూచి అన్వయించుకుంటే కుదరదని, ఆంగ్లవిమర్శకుల ప్రయోగ ధోరణులను దేశీయతా దృక్పథంతో సమన్వయించినప్పుడే అభిరుచి ధోరణియొక్క అస్థిత్వాన్ని, శక్తి యుక్తులను నిరూపించడానికి వీలౌతుందని ఒక శాస్త్రీయమైన మార్గాన్ని సాధించటం వీరి నవ్యాలోకం. దీనివలన రెండు మూడు ప్రయోజనాలు సాధింపబడ్డాయి.

1. ఇంతవరకు సాహిత్య విమర్శలో అభిరుచి విమర్శ ఉన్నట్లు గుర్తింపు ఉన్నదేకాని, కాని ధోరణిగా గుర్తించి, పుట్టుపూర్వోత్తరాలను పరిశీలించి పరిణామ వికాసాలను వివేచించిన స్పష్టమైన జాడలు లేవు. ఈ పరిశోధన ఆ దిశగా ఒక నవ్యమైన, నవ్యమైన మార్గాన్ని వేసిచూపిస్తోంది.

2. అభిరుచి విమర్శను ఆధునికుల్లో ఒక వర్గం వారు అశాస్త్రీయమైన పద్ధతిగా భావించి, వ్యక్తిగత అభిరుచులకు అలవాలమైన విమర్శగా చిత్రించి, నిందార్థకంలో, అధిక్షేపార్థకంలో కూడా ప్రయోగిస్తున్నారు. కొంత మంది ఆ అర్థంలోనే రూఢికెక్కించే వీరవ్రతాన్ని కట్టినవారుకూడా ఉన్నారు. నాగరాజుగారి పరిశోధన గ్రంథం ఈ పరిస్థితుల్లో వెలువడటంచేత అభిరుచి విమర్శను అధిక్షేపార్థంలో ప్రయోగించే ప్రాచుర్యాన్ని తగ్గించి దానికున్న

శక్తియుక్తులను తెలియజెప్పి, దానికి నిజంగా సాహిత్య విమర్శలో అంద వలసిన గౌరవాన్ని దక్కేటట్టుచేస్తోంది. ఏ ధోరణికైనా శక్తియుక్తులతో పాటు దానికి కొన్ని బలహీనతలు ఉంటాయి. అయితే అటు బలహీనతలకే గాని, ఇటు శక్తియుక్తులకే గాని ప్రాధాన్యం ఇచ్చి దాన్ని అనుశీలించటం అంత సమంజసం కాదు. నాగరాజుగారు ఈ రెండింటిని సమదృష్టితో చూచి సమ్యగ్విమర్శనం చేశారు: అందువల్ల అభిరుచి ధోరణికి న్యాయం జరిగిం దని అనుకుంటున్నాను.

3. సాహిత్య విమర్శలో రూఢికెక్కిన ప్రమాణాలను దాటి కొత్త ప్రయోగాలను ఇతర ప్రక్రియలలోలాగా సాహిత్య విమర్శచేస్తూ ఉంటుంది. అది అభ్యుదయ చిహ్నం కూడా. అలా వేసే ముందడుగులో గోచరించే నవ్య ప్రమాణాలు అభిరుచి ధోరణిగా మొదట పరిగణింపబడుతూఉంటాయి కాని అవి సాహిత్యానుశీలనంలో సాగించే సత్ఫలితాల కారణంగా శాస్త్రీయ తను సంతరించుకొని ప్రమాణిక సూత్రాలుగా పరిణతి చెందుతూఉంటాయి. ఈ సంధి కాలంలో అభిరుచి ధోరణి అభ్యుదయ మార్గానికి ఒరవడి పెడుతూ ఉంటుంది. ఈ సత్యం సాహిత్య విమర్శ చరిత్రలో జాగ్రత్తగా పరిశీలిస్తే గోచరిస్తుంది కూడా. ఆ నిశితమైన చూపుతో నాగరాజు గారు ఈ పరి శోధనను చేపట్టి నిర్వహించారు. ఈ సిద్ధాంత వ్యాసానికి నేను పర్యవేక్షక బాధ్యత నిర్వహించి ఉండటంచేత చి॥ మోచర్ల నాగరాజుగారి పరిశోధనను గురించి ఏ నాలుగు మంచి మాటలు రాసినా అభిమానంతో రాసినవి అను కోవచ్చు. నాగరాజుగారు ఎం. ఏలో, చేరక పూర్వమే డిగ్రీ స్థాయిలో విశ్వ విద్యాలయ పరీక్షలో అందులోను సాహిత్య విమర్శలో ప్రప్రథముడిగానిలిచి ఖండవల్లి సీతమ్మ గారి స్మారక బహుమతిని మా గురువుగారైన ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారి కరకమలాలతో పొందారు. ఎం ఏ స్థాయిలో వినయ వివేకాలను వికసింపచేసుకున్నారు. సాహిత్య విమర్శకులు అహం కారంగా ఉంటారని లోకంలో ఒక నానుడి ఉంది. కాని ఉత్తమ విమర్శ కుడు వినయశీలిగా ఉంటాడన్న ఉత్తమ ప్రమాణాన్ని నాగరాజుగారు జీవి తంలో, రచనల్లో ప్రదర్శించుకుంటున్నారు. ఇది భవిష్యత్తుకు బలమైన బీజం. ఎప్పుడో ఒకనాడు ఆధునిక సాహిత్య విమర్శ రంగంలో తనదైన బాపుటా నెగరేస్తూ ఒక గౌరవ స్థానాన్ని పొందాలని నేను మనసారా ఆశిస్తున్నాను. శుభమ్ భూయాత్

# నా మాట

నాకు సాహిత్యవిమర్శపై ప్రత్యేకమైన అభిమానం తెలుగుసాహిత్యం పరిచయం అయిన నాటి నుండి ఉండేది. దానికి తగినట్లు హైదరాబాదు విశ్వవిద్యాలయంలో ఎం.ఏ కోర్సులో చేరడం, దానితోపాటు విమర్శక మూర్ధన్యులు ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం గారి శిష్యత్వం లభించడం నా అదృష్టం. విమర్శ గ్రంథాలు, పత్రికా విమర్శన వ్యాసాలు మొదలైనవి చదువుతూ ఉండేవాడిని. ఒకే అంశంపై భిన్నమైన అభిప్రాయాలు దర్శన మిచ్చేవి. అవి శాస్త్రీయమైనవా ? అనే అనుమానం ఉండేది. విమర్శోద్య ద్యమాలను చదువుకున్నప్పుడు ఆంగ్ల సాహిత్య విమర్శలోని 'Impressionistic Criticism' లక్షణాలు నా అనుమానానికి సమాధానమిచ్చాయి. ఆ ధోరణిని తెలుగు సాహిత్య విమర్శకులు "అభిరుచి దోరణి"గా పేర్కొనటం కన్పించింది. ఈ అంశంపై M.Phil చేస్తే బాగుంటుందని భావించాను. ఆ సంకల్పానికి కార్యరూపమే ఈ పరిశోధనా పత్రం.

ఆధునిక సాహిత్య విమర్శ అభిరుచి దోరణి అన్న అంశం M.Phil స్థాయిలో విస్తృతమైన అంశంగా తోచింది. పైగా ఒక్క సంవత్సరంలో పూర్తిచేయాలి. మరియు సాహిత్య విమర్శ పరిణామంలోను విప్లవ ధోరణి అనంతరం మిశ్ర ధోరణులే ఎక్కువ కన్పిస్తున్నాయి. సాహిత్య సిద్ధాంతాల కన్నా సాహిత్య దృక్పథాలను, అభిప్రాయాలను ప్రకటించే వైఖరి ఎక్కువగా కన్పిస్తోంది. ఈ నేపథ్యంలో ఈ అంశాన్ని 1980-87 సంవత్సరాల మధ్య వచ్చిన సాహిత్య విమర్శపై ప్రధానంగా దృష్టిని కేంద్రీకరించాను. అయితే అంతకు పూర్వం ఉన్న సాహిత్య విమర్శను దిగ్దర్శనంగా అవలోకించి ముందుకు సాగాను.

ఈ అంశాన్ని మూడు అధ్యాయాలుగా వింగడించుకున్నాను. 'ఆధునిక

సాహిత్య విమర్శ : అభిరుచి ధోరణి' అన్న ప్రథమాధ్యాయంలో విమర్శ స్వభావాలను వివరిస్తూ అభిరుచి విమర్శయొక్క స్వరూప స్వభావాలను వివరించాను ఆంగ్ల సాహిత్య విమర్శలో దాని తీరుతెన్నులను సమీక్షించ డానికి ప్రయత్నం చేశాను. ఆంగ్లాంధ్ర సాహిత్య విమర్శల్లో ఈ అభిరుచి విమర్శ' ఏర్పడే ప్రవృత్తుల్ని శక్తియుక్తుల్ని బలహీనతల్ని పేర్కొన్నాను.

ఇక రెండవ అధ్యాయం "ఆధునిక సాహిత్య విమర్శ : అభిరుచి" అన్నదాంట్లో మౌలికంగా ఐదు దశలను గుర్తించాను. 1. ప్రాథమిక దశ 2. పరిణామదశ. 3. పరిణతిదశ. 4. ప్రయోగదశ. 5. మిశ్రదశ. ఈ దశల్లో కందుకూరివారి నుండి నేటివరకూ ఉన్న సాహిత్య సిద్ధాంతాలలో ఉన్న అభిరుచి విమర్శ స్వభావాన్ని వివరిస్తూ, మిశ్రదశ 1980 తర్వాత నుండి ఉన్నట్టు గుర్తించాను.

మూడవ అధ్యాయం 'ఆధునిక సాహిత్య విమర్శ-అభిరుచి ధోరణి (1980-1987)' అనేది ఈ పరిశోధన పత్ర మూలం. విమర్శకుడు ఏ పద్ధతిని అనుసరిస్తున్నా విమర్శకుడు తాను పొందిన స్పందనను అనుభవ ప్రమాణంతో లక్షణ గ్రంథాలలో లేని లక్షణాలను సృష్టించి అవి విశ్వజనీన ప్రమాణాన్ని సాధించాలని ప్రయత్నిస్తున్నాడు. ఈ అభిరుచిని వ్యక్తిగత, ప్రయోగాత్మక, ప్రామాణిక అనే వర్గాలుగా విభజించి విశ్లేషించటం జరిగింది.

సాహిత్య విమర్శలో అభిరుచి విమర్శన విధానం అనుస్యూతంగా ఉండే జీవ స్రవంతి. నవ్యతను సాధించాలంటే విమర్శకుడు మౌలికంగా అభిరుచి విమర్శకుడయి ఉండాలి. ఎందువల్లనంటే ఏ సిద్ధాంతమైనా ప్రాథమిక దశలో అభిరుచి ధోరణిగా కన్పిస్తుంది. అవి పొందే ఆదరణ ఫలితాల పై శాస్త్ర స్థాయిని పొందుతాయని, ఈ శాఖలో కవి ఎంతటివాడో, విమర్శకుడు అంతటి వాడని "ముగింపు"లో పేర్కొనటం జరిగింది.

గత కాలంలో వచ్చిన విమర్శకు, నేటి విమర్శన రీతికి భేదం స్పష్టంగానే కన్పిస్తోంది. నేడు స్వేచ్ఛారూప విమర్శన వెలువడుతోందనవచ్చు.

అభిప్రాయాలు, నిర్ణయాలు, సూత్రాలు, లక్షణాలు స్వేచ్ఛగా వ్యక్తీకరిస్తున్నారు. తమ అభిప్రాయాలకు సరైన శాస్త్రీయత చేకూరాలనే భావన గాఢంగా కన్పిస్తోంది. ఆధునిక సాహిత్య విమర్శలో కన్పిస్తున్న ఈ 'అభిరుచి దోరణి'పై పరిశోధన చేయటంలో ఇది తొలి ప్రయత్నం. ఈ చిన్న యత్నం ఏ ఒక్కరికైనా "అభిరుచి విమర్శ"పై ఆసక్తిని, అవగాహనను కల్గిస్తే ధన్యుడను.

పరిశోధన పథంలో పయనించడానికి మూల మూర్తులయిన అమ్మా నాన్నలకు,

నా అభిమాన విషయంపై పరిశోధన చేయించిన, పర్యవేక్షించిన మా మాష్టారు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారికి,

నా అభ్యర్థనను మన్నించి కృతిని స్వీకరించడానికి అంగీకరించిన ఆచార్య రవ్వా శ్రీహరి గారికి,

నా అభివృద్ధిని కాంక్షించే ఆచార్య కె కె. రంగనాథచార్యులుగారికి, డా॥ సి. ఆనందా రామంగారికి, డా॥ పి. రామనరసింహం గారికి' డా॥ ఎన్. ఎస్. రాజుగారికి,

నా పరిశోధనా ప్రయాసలో ప్రతిక్షణం వెన్నంటి ఉండిన నా సతీమణి చంద్రికకు,

కోరిన వెంటనే పీఠిక వ్రాయటానికి అంగీకరించి, తమ అమూల్యమైన అభిప్రాయాన్ని అందించిన డా॥ కోవెల సంపత్కుమారాచార్య గారికి,

నా పరిశోధనకు ఆర్థిక సహాయాన్నందించిన హైదరాబాదు విశ్వవిద్యాలయాధికారులకు,

నా పరిశోధన పత్రం ముద్రణకు నోచుకునేందుకు అర్థిక సహాయం అందించిన తెలుగు విశ్వవిద్యాలయానికి,
ముఖపత్రానికి అలంకరణ కూర్చిన చిత్రకారుడు వీరాస్వామికి,
నిర్ణీత సమయంలో ప్రతులను అందించిన రాజేశ్వరీ ప్రింటర్స్‌వారికి,
ప్రత్యక్షంగాను, పరోక్షంగాను నా పరిశోధనకు సహకరించిన అప్తులందరికీ —

నా కృతజ్ఞతలు

# విషయ సూచిక

# ఆధునిక సాహిత్య విమర్శ
# అభిరుచి ధోరణి

1 It (criticism) treats work of art simply
as a starting point for new creation,
as a suggetion for new work of the critics
own that need not necessarily bear any
obvious resemblence to the things he criticizes

అధునిక కాలంలో సాహిత్య విమర్శ సృజనాత్మక వైఖరితో స్వతంత్ర ప్రక్రియగా ఏర్పడింది. సాహిత్య ధర్మాన్ని సృజనాత్మకతతో శాస్త్రీయంగా వ్యక్తీకరించటం విమర్శ మౌలిక ధర్మం. విమర్శ అనుశాసనాన్నికాని, అనుశీలనాన్నికాని చేయటం దాని స్వభావం అనుశాసనం శాస్త్రధర్మాన్ని అనుశీలనం కళాత్మకతను ప్రకటించేవి. శాస్త్రీయత, కళాత్మకత అనేవి విమర్శలో నాణేనికి రెండు వైపుల వంటివి. ఈ రెండిలోను ఉత్తమత్వాన్ని నిర్ణయించేది సృజనాత్మకత. విమర్శ శాస్త్ర స్వభావం కల్గినదైతే కావ్యలక్షణ "వివేచనం"గాను, కళాత్మకతను సంతరించుకున్నదైతే "కావ్యరుచి నిరూపణం"గాను సృజనాత్మకత భిన్నరూపాలుగా ఉంటుంది.

కవి కాని విమర్శకుడు కాని సృజనాత్మకశక్తి సహజంగానే కల్గిఉంటారు. కవి ఒకానొక వస్తువునాధారంగాగ్రహించి సృజనాత్మకతను వ్యక్తీకరిస్తాడు. విమర్శకుడు తన సృజనాత్మక ప్రతిభతో బాహ్యాంతర రూపాల్ని దర్శించి కావ్యతత్వాన్ని కావ్యలక్షణ నిరూపణంగాను, కావ్యరుచి వివేచనను కళాసుందరంగాను అభివ్యక్తీకరిస్తాడు. ఈ అభివ్యక్తిలో విమర్శకుని నిర్లిప్తతకన్నా నిమగ్నత ఎక్కువ పాత్ర వహిస్తుంది. నిమగ్నత వలన కావ్యబాహ్య స్వరూపాన్ని దాటి అంతర వ్యక్తిత్వం వ్యక్తీకరించ బడుతుంది. కావ్యానుభవాన్ని వివేచించే విమర్శకు నిమగ్నత ప్రాణంగా భాసిస్తుంది.

సాహిత్యాన్ని విమర్శ శాస్త్ర, కళాప్రమాణాలతో విలువ కడతుంది. ఈ ప్రమాణాల ఆవిర్భావానికి విమర్శకుని అనుభవమే మూలం. అనుభవ వ్యక్తీకరణలో శాస్త్ర స్వభావానికి ప్రాధాన్యం కల్గినపుడు విమర్శ శబ్దార్థ చర్చలగాను, వ్యాఖ్యాన రూపంగాను, కావ్యలక్షణ నిరూపణంగాను సాగుతూ అనుశాసనాన్ని చేస్తుంది, కళాధర్మం ప్రాచుర్యం వహించినపుడు కావ్య కళాస్వభావాన్ని వ్యక్తీకరిస్తూ ప్రయోగాలను నవ్యదృష్టితో వివేచిస్తూ కావ్యానుభవాన్ని అందించే అనుశీలనంగా రూపు ధరిస్తుంది. విమర్శ ఈ రెండు స్వభావాల్ని సహజంగా కలిగి ఉంటుంది.

2 "Criticism may be regarded as having two different functions that of interpretation and that of Judgement"

సాహిత్య విమర్శ కావ్యానుశాసనం చేస్తూ కావ్యానుభూతిని వివేచించే సృజనాత్మక ప్రక్రియ. కావ్యలక్షణం చెప్పటానికైనా, కావ్యానుభూతిని విలువ కట్టటానికైనా విమర్శకుడు వస్తువుతో తాదాత్మ్యాన్ని పొందుతాడు. కావ్యానుభూతిని వివేచించి విలువ కట్టటం విమర్శ స్వభావం.

3 "Criticism as I understood it, is the endeavour to discriminate between experiences and to evaluate them"

కావ్యానుభవ వివేచనానికి విమర్శకుడు సాత్త్విక హృదయుడై కావ్య సౌందర్యంలో సంలీనుడైనప్పుడు తాను పొందిన అనుభవ వ్యక్తీకరణలో విమర్శకుని ప్రమేయం ఉంటుంది. విమర్శకుడు నిర్లిప్తంగాఉండి సాహిత్యాన్ని దర్శించగలడు. కాని, అనుభూతిని విలువ కట్టటానికి కళాత్మక దృష్టిఉండాలి. ఈ కళాత్మక ధర్మంనుండి నవ్యసూత్రాలు. నూతన సమన్వయాలు, వినూత్న దర్శనం మొదలైనవి ఆవిర్భవిస్తాయి. వీటి ద్వార విమర్శకుని సృజనాత్మక వైఖరి వ్యక్తమౌతుంది.

ఆధునిక కాలంలో రూపొందిన విమర్శ లక్షణాల నిరూపణన్నా, కళాత్మక విలువలకు ప్రాధాన్యతనిస్తూ విమర్శకుని వ్యక్తిత్వానికి ఒక ప్రత్యేక స్థానాన్ని కల్పించింది. కావ్యానుశాసన దృష్టితో సాగి కావ్యానుభూతిని వివేచించే దశకు పరిణామం చెందటానికి విమర్శకుని సృజనాత్మక వైఖరే మూలం. ఆధునిక సాహిత్యానుశీలనకు ప్రాచీన ఆలంకారిక సిద్ధాంతాలు సంపూర్ణంగా వర్తించక పోవటంవలన నూతన సూత్రాల్ని

నిర్మించవలసి వచ్చింది. కవితాలక్షణాల్ని, కావ్యానుభవాల్ని చెప్పటానికి విమర్శకుని అనుభవమే కేంద్రమైంది. కవి ఎలె విమర్శకుడు కూడా ప్రత్యేక దృక్పథం, సౌందర్య సంలీనత్వం, సృజనాత్మక వైఖరి ఉండటం వలన భిన్నమార్గాలు, స్వీయ అభిప్రాయాలు సిద్ధాంతాలు రూపొందాయి.

4 "The identity of genious and taste is the final achievement of modern throught on the subject of about, and it means that fundamentally, the creative and critical instints are one and the same"

సాహిత్య విమర్శ చేయటానికి రెండు శక్తులు అవసరమౌతాయి. ఒకటి పాండిత్యం మరొకటి కావ్యరుచ్యనుభవతత్వం. పాండిత్యం వలన ప్రమాణాలను చూపుతూ శాస్త్రీయంగా విమర్శ సాగుతుంది. రుచ్యనుభవతత్వం చేత కావ్యరుచి వ్యక్తమౌతుంది. ఆధునిక విమర్శలో ఈ రెండు గుణాలు మౌలికంగా ఉంటూ విమర్శకుని వ్యక్తిత్వాన్ని ప్రకటిస్తున్నాయి.

విమర్శ భవిష్యద్దర్శనాన్ని చేస్తూ గతం పునాదిగా వర్తమానంలోని కవితను విలువకడుతూ సార్వకాలిక విలువను పొందటానికి ప్రయత్నిస్తుంది. ఈ విలువలు శాశ్వత విలువలు [ Absolute Values ], సాపేక్ష విలువలు (Relative Values) అని రెండు రకాలు. శాశ్వత విలువలు పరిణామంచెందవు. సాపేక్ష విలువలు ఏ యుగాని కాయుగానికి, ఏకావ్యానికికావ్యానికి, ఏ ప్రక్రియకాప్రక్రియకు వైవిధ్యం కల్గి నిరంతర పరిణామశీలం కలవి. సాపేక్ష విలువల వ న వినూత్న దర్శనాలు, సమన్వయాలు, సిద్ధాంతాలు మొదలైనవి రూపొందుతాయి. సాపేక్ష విలువలు మూడు రకాలుగా ఏర్పడవచ్చు.

1) ప్రక్రియానిర్మాణ సూత్రాలు.

2) విమర్శకుని దర్శనం నుండి వ్యక్తమయ్యే మార్గాలు.

3) తన కవితాను శీలనం కోసం కవి అందిచే లక్షణాలు.

ప్రక్రియా సూత్రాలు శాస్త్రదృష్టితోను, విమర్శకుని దర్శనంలో రూపొందే సూత్రాలు సృజనాత్మకతతో కళాత్మకతను కల్గి ఉంటాయి. ఈ రెండింటికి విమర్శకుని అనుభవమే మూలం. కవి నిర్మిత లక్షణాలు పరిమితమైన పరిధికల్గి ఉంటాయి.

సృజనాత్మక శక్తి కవికి ఎంత అవసరమో విమర్శకునికి అంతే అవసరం. కవి తన రుచిని ప్రకటిస్తే, విమర్శకుడు తనదైన అభిరుచిని వ్యక్తీకరిస్తాడు. కావ్య సౌందర్య సందర్శనంలో కవి విమర్శకులు ఒకే కేంద్రం దగ్గరనిలుస్తారు.

(5) "రచయితకెలాంటి ప్రతిభకావాలో విమర్శకుడికి అలాంటి సృజనాత్మక ప్రతిభ కావాలి. భావతీవ్రత కావాలి, నైపుణ్యం కావాలి."

కవితలోని భావతీవ్రతను సంయమనంతో కళాత్మకంగా మలచే నైపుణ్యం దాన్ని వ్యక్తీకరించే సృజనాత్మక ప్రతిభ విమర్శకునికి కావాలి.

(6) "కావ్యోద్దేశాన్ని కావ్యం ఇచ్చే అనుభూతిని విలువ (Evaluation) కట్టడం విమర్శకుని కర్తవ్యం. విమర్శకుడు తన దృష్టికోణాన్ని పూర్తిగా మర్చిపోయి విలువ నిర్ణయించటం అసాధ్యం."

కావ్యానుభవం వివేచనం చేయటనికి విమర్శకుడు సాత్త్విక హృదయుడై కావ్యసౌందర్యాన్ని అనుభవిస్తాడు. ఆ కావ్యానుభవ వ్యక్తీకరణలోని లక్షణ నిరూపణకు రుచివివేచనకు విమర్శకుని నిమగ్నత ఎక్కువ పాత్ర నిర్వహిస్తుంది.

7 "Among critics themselves there are not wanting those who take up the position that, how ever much principles and critiria may be invoked, that ever efforts may be made to eleminate the personal factor, all criticism is fundamentally subjective and impressionistic."

విమర్శన పద్ధతి ఏదైనా శాస్త్రీయత తప్పనిసరిగా ఉంటుంది. స్వీయాభిరుచిని కప్పివుచ్చాలని ఎంత ప్రయత్నించినా విమర్శలో మౌలికంగా ఆత్మాశ్రయత చోటు చేసుకుంటూ విమర్శలో నవ్యలక్షణలను, సమన్వయాలను చేస్తూ అభిరుచి విమర్శ విధానం రూపొందుతోంది.

## 2: అభిరుచి విమర్శ-స్వరూపం

నేటి తెలుగు సాహిత్య విమర్శలో Impressionistic Criticism కు సమా

నార్థకంగా "అభిరుచి విమర్శ"అని ప్రయోగిస్తున్నారు. (సుబ్రహ్మణ్యం జి.వి. ఉద్యమాలు ఉపశ్రుతులు : ఆంధ్రసాహిత్య విమర్శ - ఆంగ్ల ప్రభావం - 1983 : వెల్చేరు నారాయణరావు అనువాదం - రామారావు ఆర్. వి. తెలుగు పరిశోధనల తీరుతెన్నులు - అభ్యుదయ - విమర్శ విశేసంచిక). లక్షణ నిరూపణలోను, రుచివివేచనంలోను ఉండేస్వీయ సృజనాత్మత వైఖరిని సంకేతిస్తూ అభిరుచి విమర్శ అని పేర్కొంటున్నారు. ఆధునిక కవిత్వాన్ని అనుశీలించటానికి, నవ్యలక్షణాలను రూపొందించేటప్పుడు, సంప్రదాయ అలంకారిక విమర్శలో నవ్య దృక్పథం ప్రసరించేటప్పుడు ఈ అభిరుచి విమర్శనా విధానం రూపొందుతోంది.

(8) "భావకవిత్వ కాలంలో కవులు ప్రామాణికగ్రంథాలను వ్యాఖ్యానించడమే గాక తమ కవిత్వానికి తామే వ్యాఖ్యానాలు చెప్పే బాధ్యత కూడా తీసుకొన్నారు. కళాస్వాదన విషయంలో కొత్త రుచులకు, సరికొత్త దృక్పథాలకు వారు చాలావరకు కారకులు అయితే వారి పద్ధతి అభిరుచి ప్రధానం (Impressionistic) మాత్రమే."

ఆధునిక కాలంలో వచ్చిన భావకవిత్వాన్ని ప్రాచీనాలంకారిక సూత్రాలతో విలువ కట్టలేక పోవటంతో కవులే విమర్శకులై కొత్త రుచుల్ని అందించారు. ఈ కొత్త దృక్పథం కొత్త రుచులు స్వీయానుభవ ప్రమాణం కలవి. స్వీయానుభవ ప్రమాణికతనే 'అభిరుచి' అంటున్నారు.

అభిరుచి విమర్శ వైయక్తికమైనదిగా కనిపిస్తున్నా అభివ్యక్తి దశలో సామాజికాది పరిస్థితులు పునాదిగా ఉండటం వలన కూడా ప్రామాణికతను సంతరించు కుంటుంది.

(9) "ఈ అభిరుచి పుట్టి పెరిగిన వాతావరణం సాంఘిక, దేశీయ, జాతీయ, కుటుంబ సంప్రదాయాల నుండి నిష్పన్నమౌతుంది"

విమర్శకుడు కూడా సమాజానికి అతీతుడుకాదు. తనఅభి

ప్రాయాలతో పాటు దేశ, కాల సంప్రదాయాల ప్రభావం ఉంటుందని తెలుస్తుంది.

(10) "ప్రత్యేకమైన అభిరుచులు ఆశయాలు, తత్వచింతనకల విమర్శకుడైతే రచయితను ఇలారాయమని శాసించడానికి ప్రయత్నించవచ్చు"

కవితా మార్గాన్ని మళ్ళించడానికి విమర్శకుడు కవిత తత్వాన్ని గ్రహించి రాబోవు పరిణామాన్ని గుర్తించి దాని స్వరూపాన్ని నిర్ణయించి చెప్పగలగాలి. విమర్శకుడు కొన్ని ఆశయాలు కల్గి, కవితా సౌందర్య సంలీనత్వం కల్గి, క్రాంతదర్శి అయినవాడు భవిష్యద్రూపాన్ని నిర్దేశించే అభిరుచి విమర్శకుడు కాగలడు.

ఆధునిక కాలంలో సాహిత్య విమర్శ కూడా హృదయ వ్యాపారమే అనే దృక్పథం ఏర్పడింది. కవి ఎంతటి భావతీవ్రతకు గురి అవుతాడో విమర్శకుడు ఆ స్థాయిని అందుకొని ఆ కావ్యానుభవ విశేషాల్ని వ్యక్తీకరిస్తున్నాడు. విమర్శకుని అనుభవం శాస్త్రీయతను సంతరించుకొంటే ఉత్తమ అభిరుచి విమర్శగా గుర్తించబడుతుంది.

విమర్శ వస్తుదృష్టి (Objective) గా ఉండాలని సాహిత్యేతర సూత్రాలతో అనుశీలన ఒకవైపు, సాహిత్య సౌందర్యతత్వాన్ని ప్రకటించాలని సహృదయానుభవం ప్రమాణంగా మరోవైపు, సాగుతుంది. విమర్శకుడు తన సృజనాత్మక ప్రతిభతో తన మార్గాన్ని నిర్మించాలనే ప్రయత్నాలు కన్పిస్తున్నాయి ప్రతి నవ్యదృక్పథం, విశ్లేషణ, సమన్వయం మొదలైనవి సృజనాత్మకతకు ప్రతీకలు. ఈ సృజనాత్మక వైఖరి సాహిత్య విమర్శలో అభిరుచి విమర్శనా విధానం.

## 3. ఆంగ్ల సాహిత్య విమర్శ : అభిరుచి విమర్శ

ఆధునిక ఆంగ్ల సాహిత్య విమర్శ రెండు పాయలుగా కనిపిస్తుంది. ఒకటి సంప్రదాయ పరంపరగా వస్తున్న విమర్శ ప్రమాణాలు,

రెండు కాలానుగుణంగా మార్పు చెందుతూ శాస్త్రీయంగా రూపొందుతున్న ప్రమాణాలు అని గుర్తించవచ్చు. 17వ శతాబ్ది మధ్యభాగం నుండి ఆంగ్ల సాహిత్య విమర్శలో పునరుద్ధరణ యుగం ప్రారంభమైంది. ఈ కాలం నుండి విమర్శలో నూతన సిద్ధాంతాలకు ప్రాధాన్యం ఏర్పడింది. 20వ శతాబ్దారంభంకల్లా సంపూర్ణంగా ఆధునికత్వాన్ని సంతరించుకొంది.

19వ శతాబ్దపు తొలిరోజుల్లో రెక్కలిప్పిన కాల్పనిక విమర్శ సంప్రదాయ ప్రమాణాల్ని తిరస్కరించి స్వేచ్ఛగా స్వతంత్రతతో కూడిన విమర్శను సృష్టించింది. ఆధునిక సాహిత్యానికి అన్వయించని ప్రాచీన ప్రమాణాల్ని త్రోసిరాజంది. నవ్యత, వ్యక్తిత్వస్ఫూర్తిగా యుగధర్మం సాగింది. విమర్శకుడు ఏ విధానంలో విమర్శ చేస్తున్నా స్వీయానుభవాల్ని, స్వీయాభిప్రాయాన్ని ప్రకటించే వైఖరిని "Impressionistic Criticism" గా గుర్తించారు. 20వ శతాబ్దపు తొలి రోజుల్లో విమర్శలో దీన్ని ఒక ప్రత్యేక విధానంగా గుర్తించారు. ఈ కాలంలో 'Impressionistic Criticism ఉద్యమ స్ఫూర్తితో సాగింది.

11 "The method was spread for and wide and seemed to triump toward the end of the 19th century in the purple pages of water petar and oscar wild and in the detirate personalities of anotole Frmce and George saintsbury"

విమర్శలో 'అభిరుచి' విమర్శనా విధానం ఎప్పుడు ఉండేదే. అయితే కొందరిచేత ప్రత్యేకంగా గుర్తించబడి 'అభిరుచి విమర్శ' ప్రాచుర్యాన్ని పొందింది.

సాహితీ స్పందనతో సాహిత్యోద్యమాలను సృష్టించే దేశాలలో ఫ్రాన్స్ అగ్రగామి. కవిత్వేతర కళలలో వచ్చిన ఉద్యమాలు సాహిత్యంలో ప్రతిఫలించటం సాధారణ ధర్మంగా కన్పిస్తుంది. "Impressionistic" అనే పదం సంగీతంలో మొదట పేర్కొనబడింది. "Debussy" అనునతడు

సంగీతాలాపనలో సహజమైన భావతీవ్రతతో క్రొత్త రాగాలతో రాగాలాపన చేసేవాడు. ఆతని వైఖరిని కొందరు అనుసరించారు. వారి మార్గాన్ని "Impressionist School" గా విమర్శకులు పేర్కొన్నారు. సంగీత కళ లోంచి చిత్రకళలోకి వ్యాపించి అధిక ప్రాచుర్యాన్నిపొందింది సాహిత్యంలో-

12 "Impressionism in literature, a highly personalized manner of writer, reflecting the individual temperment of the writer. The term is borrowed from the impressionist paintiny movement of late 19th Century.

చిత్రకళ నుండి ఈ పదాన్ని గ్రహించినా సాహిత్య విమర్శలో ఈ పద్ధతి 17వ శతాబ్దం నుండి ఉంది. అయితే స్వీయదృక్పథానికి ప్రాధాన్యం ఇచ్చి ఉదేశ పూర్వకంగా పోషించటం 19వ శతాబ్దం నుండి కన్పిస్తుంది.

అభిరుచి విమర్శ ఫ్రాన్స్‌లో గుర్తించబడినా ఇంగ్లాండ్, అమెరికా దేశాల్లో బాగా ప్రచారంపొందింది. ఈ విధానం బ్రిటన్‌లో కాల్పనిక విమర్శలో విమర్శకుని ప్రతిభకు పట్టంకడుతూ ప్రాచీన ప్రమాణాల్ని ఎదిర్చి ఏర్పడింది.

13 The romantist rejected the old standards of criticism. Some of them like hugo, attempted to set up new standards in their place.

కవిత్వంతో పాటు ప్రమాణాలు మారాలనే వాదంతో కాల్పనిక Impressionistic విమర్శనా విధానాన్ని పోషించింది. అమెకా సాహిత్య విమర్శలో

విమర్శ ప్రాచీన ప్రమాణాల స్థానంలో కొత్త విలువల్ని సృష్టించే వైఖరితో

14 "Judgement is necessary, Asut, it is possible only to a man taste"

అని విలువ కట్టడానికైనా, తీర్పు ివ్వటానికైనా రుచ్యనుభవమే ప్రాతి పదికగా ఈ అభిరుచి విమర్శ ఏర్పడింది.

ఒక రచనను చదివినప్పుడు విమర్శకునిపై అకావ్యం వేసే ప్రభావాన్ని, దానివల్ల కల్గే స్పందనను ఆధారం చేసుకొని సాగే కావ్యాను శీలనం అభిరుచి విమర్శ. వస్తువులోని వాస్తవసత్యాన్ని వక్రీకరించకుండా స్వీయదర్శనానికి ప్రాధాన్యతనిస్తుంది.

15 Impressionist gives his Impressions of Subjective reality, but he is not interested in distroying or reshaping that reality. Rather he uses his Knowledge of the self to try and understand that reality to dispiet it and came to Terms with it"

అభిరుచి విమర్శకుడు తన సృజనాత్మకతతో నవ్యదర్శనంతో వస్తుతత్వాన్ని నిరూపిస్తాడు. అయితే వస్తుతత్వానికి కొత్త రూపాన్ని సృష్టించి దాన్ని కప్పివుచ్చడు. తన అనుభవంతో విజ్ఞానంతో వస్తుతత్వాన్ని వ్యక్తీక రిస్తాడు. ఆంగ్లసాహిత్య విమర్శలో అభిరుచి విమర్శ (I mpressionistic criticism) కు lanb, Hazlilt Dequince ఆది పురుషులైతే Pater, oscar wild, Saintsbury, Quiller, Anatote France, Sainte-Beuve Spingram, Paul, Rosenfelld మొదలగు వారు మూలస్తం భాలుగా నిలిచిపోషించారు.

డా॥ శామ్యూల్ జాన్సన్ 1709-54 మధ్య కాలంలో ఆంగ్ల కవుల జీవితాలు, షేక్స్పియర్ రచనలకు పీఠికలు వ్రాశాడు. ఇతని విమ ర్శన విధానం అనుశాసనాత్మకమైన అభిరుచి విమర్శ తరువాత కోల్‌రిడ్జిలోను అభిరుచి విమర్శన ఛాయలు కన్పిస్తాయి. వాల్టర్ పేటర్ ఈ విమర్శను గురించి

16 What is important is not that the critic Should Posses a correct abstract defination of beauty for the intellect, but Certain Kind of temperment, the

power of being deeply moved by the Presence of beautifully objects'' అని అంటారు,

అభిరుచి విమర్శను పతాక స్థాయికి తీసుకొనిపోయిన వాల్టర్ పేటర్ విమర్శను గురించి

17 The Self exepression in Paters critical writing is never Strident or forth right. Rather, he expresses him self Obliquely, almost apolgetically. But his criticism often letts us more about him self then about his Subjects.

అన్న అభిప్రాయం విమర్శకుల్లో ఉంది. అయితే అభిరుచి విమర్శ వస్తుతత్వానికి సంబంధించిన అనుభవాన్ని వ్యక్తీకరించటం దాని లక్షణంగా చెప్తారు.

18 To have Sensations in the Presence of a work of art and to express them that is the funciton of criticism for the impressionistic critic''

ఆంగ్ల సాహిత్య విమర్శలో ప్రాచీన విమర్శ ప్రమాణాల్ని తిరస్కరిస్తూ, విమర్శకుని అనుభవానికి ప్రాధాన్యాన్నిస్తూ ఈ Impressionistic criticism ఏర్పడింది. పాశ్చాత్య విమర్శ ప్రభావంచేత తెలుగు సాహిత్య విమర్శలో కూడా అటువంటి ధోరణిని గుర్తించారు విమర్శకులు. అయితే విమర్శకుని సృజనాత్మక వైఖరి నుండి ఏర్పడే నవ్య దృక్పథాలు, సమన్వయాలు సిద్ధాంతాలు మొదలైనవి దేశీయత పునాదిగా కల్గి 'అభిరుచి' విమర్శ ప్రత్యేకతను సంతరించుకుంది.

## 4. ఆంగ్లాంధ్ర సాహిత్య విమర్శల్లో అభిరుచి ప్రవృత్తి.

విమర్శలో అనుభవ వ్యక్తీకరణలో నిర్లిప్తత కన్నా నిమగ్నత ఎక్కువ పాత్ర నిర్వహిస్తుంది. నిమగ్నతకు అభిరుచి జీవగఱ్ఱ. అభిరుచి విమర్శ ఈ క్రింది విమర్శన ప్రవృత్తి కల్గినప్పుడు భాసిస్తుందని చెప్పవచ్చు

1. విమర్శకుని విమర్శ అతని ఆత్మాభివ్యక్తిగా రూపొందినప్పుడు,

2. విమర్శకుడు నూత్న సమన్వయాన్ని సాధిస్తున్నప్పుడు,

3. విమర్శకుడు క్రొత్త ప్రయోగం ప్రారంభిస్తున్నప్పుడు,

4. విమర్శకుడు భిన్న దృక్పథాల మధ్య సమన్వయం ప్రతిపాదిస్తున్నప్పుడు,

5. విమర్శకుడు పూర్వ సిద్ధాంతాలను తిరస్కరించి క్రొత్త మార్గాన్ని అన్వేషిస్తున్నప్పుడు,

9. విమర్శకుడు ప్రక్రియలకు లక్షణాల్ని నిర్మించేప్పుడు,

ఈ విధంగా కొన్ని మార్గాల్ని గుర్తించవచ్చు. ఈ పద్ధతి కల విమర్శకులు సహజంగా సృజనాత్మక ప్రతిభ కలవారై ఉంటారు. విశ్వజనీనతని పొందని వ్యక్తిగత అభిప్రాయాలు, ఇష్టాఇష్టాలతో నిండిన సిద్ధాంతాలు అభిరుచి విమర్శగా పరిగణింపబడవు. సాహిత్య దృక్పథం ఉండి శాస్త్రీయ బలం గల సిద్ధాంతాలు సమన్వయాలు మొదలైనవి అభిరుచి విమర్శగా రూపొందుతుంది.

విమర్శలో "అభిరుచి ధోరణి" అనుస్యూతంగా ఉంటుంది. ఈ విమర్శలో శాస్త్ర, కళాప్రమాణాలకు విమర్శకుని అనుభవమే మూలం కావడం వల్ల విమర్శను సమర్థవంతంగా నిర్వహించలేని వైఖరి కూడా కనిపిస్తుంది.

1. విమర్శకుడు ఒక ధ్యేయంతో కవిని కాని, విమర్శకుని కాని, దూషించే టప్పుడు,

2. విమర్శనారంగంలో తన స్థానాన్ని పెంచుకోవాలనే ఆతృతతో నిర్ణయాలు చేస్తున్నప్పుడు,

3. శాస్త్రీయంగా భాసించేటట్లు స్వీయాభిప్రాయాల్ని వ్యక్తీకరించేటప్పుడు

4. తన కీర్తిని పెంచుకోవాలని అపరిపక్వ నిర్ణయాలు చేసేటప్పుడు, అభిరుచి విమర్శ న్యూనతను పొందుతోంది.

అభిరుచి విమర్శకు రెండు కోణాలున్నాయని గుర్తించవచ్చు సృజనాత్మకతతో కూడి స్వీయ ప్రతిపాదనలతో శాస్త్రీయతతో సాగేది ఒకటి వస్తువుతో సంబంధం తెగిపోతూ ఊహాగానాలుగా ప్రశంసా దూషణలు అధికమైన అశాస్త్రీయ ధోరణి రెండవదిగా కనిపిస్తోంది. విమర్శకుడు సమర్థుడైతే కావ్యసౌందర్య సందర్శనం చేసి ప్రామాణికంగా శాస్త్రీయంగా విమర్శను వ్యక్తీకరించగలడు.

19. Every one has impressions in the face of literary experience and may are compelled to record them. Their value depends, of course upon the taste, knowledge and writing ablity of the critic.

విమర్శకులు సహజమైన సృజనాత్మక ప్రతిభ కలవారైతే ఈ అభిరుచి విమర్శ ఉత్తమమైందిగా రూపొందుతుంది. విమర్శకుని పాత్ర సుస్పష్టంగా అభివ్యక్తం అవుతూ వస్తుతత్వాన్ని తెలుపుతూ తాత్త్విక దర్శనాన్ని కలిగిస్తుంది అభిరుచి విమర్శ.

20. "Impressionist criticism at its best, he continues is the record of a single temperment at a Parti-cular movement in the presence of literary work capable arousing spiritual energies."

—o—

# ఆధునిక సాహిత్య విమర్శ

## అభిరుచి

1. Aclear consciousness of a scheme of relationships between methods is in itself a remedy against mental confusion, even though the individual may clect to combine several methords"

తెలుగు సాహిత్య విమర్శ పాశ్చాత్య ప్రభావం వలన అంతర బాహిర రూపాన్ని గుణ దోష విచారణ చేస్తూ సమగ్ర కావ్యానుభవాన్ని అందించే స్వతంత్ర ప్రక్రియగా రూపొందింది. తెలుగు సాహిత్యవిమర్శలో పాశ్చాత్య ఉద్యమా ప్రభావం ఒక్కసారిగా ప్రసరించినా, ఆయా ఉద్యమాల స్వభావాన్ని గ్రహిస్తూ, దేశీయత పునాదిగా కలిగి విమర్శోద్యమాలు సాగాయి. 'సంప్రదాయ', 'మార్క్సిస్టు' 'శిల్పవాద', 'రూపవాద' మొదలైన విధానాల్లోని విమర్శచేస్తున్న సృజనాత్మక వైఖరిని సంకేతిస్తూ "అభిరుచి విమర్శ" జీవత్ స్రవంతిగా కొనసాగుతోంది.

2. "ఇప్పటి వరకు మనం చేసిన పని గురించి సాహిత్యంఅంటే మనకున్న దృక్పథాన్ని గురించి మన సాహిత్య సిద్ధాంతాల్ని గురించి ఒకమాటలో చెప్పాలంటే అవి అభిరుచి ప్రధానాలు (impressionistic)అనవచ్చు"

మనకున్న సాహిత్యానుశీలన సూత్రాలు మౌలికంగా ఒక వ్యక్తి అనుభవంనుంచి వచ్చినవే. వ్యక్తి అనుభవం సామాజిక అనుభవంగా పరిణమిస్తే శాస్త్రీయతను పొందుతుంది అంటే విమర్శకుని "అభిరుచి" విశ్వజనీనమౌతుంది. ఆధునిక సాహిత్య విమర్శ నూతన లక్షణాలను, సమన్వయా

లను ప్రకటిస్తూ అభిరుచి ప్రధానంగానే సాగుతోంది. ఈ అభిరుచిని ఐదు దశల్లో గుర్తించవచ్చు.

1. ప్రాథమిక దశ, 2. పరిణామదశ, 3. పరిణతిదశ 4. ప్రయోగ దశ, 5. మిశ్రదశ.

ఈ దశలు ఏ కాలంలోనైనా ఉండవచ్చు. కాని స్థూలంగా చూస్తే చారిత్రక పరిణామంలో ఈ అభిరుచిపై దశల క్రమంలోనే కన్పిస్తోంది.

## 1. ప్రాథమిక దశ

తెలుగు సాహిత్య విమర్శ కందుకూరి వీరేశలింగం పంతులు గారినుండి ప్రారంభమైంది. ఈ కాలంలో ప్రధానంగా భాషా, వ్యాకరణ దోష నిరూపణలతో విమర్శ సాగింది. సి. పి. బ్రౌన్, మెకంజి వంటి వారి కృషితో గ్రంథ పరిష్కార విమర్శ నిర్దుష్టరూపాన్ని పొందింది. ఈ మేలు పతులే ఆధునిక విమర్శకు పునాదులు. వీని ఆధారంగా కవుల చరిత్రలు, సాహిత్య చరిత్రలు వ్రాసారు. ఇక వ్యాసరూపాల్లో "నన్నయ వైదీకియా? నియోగియా?" 'ఆంధ్రమున అనుస్వారము కలదా' వంటి అంశాలతో చారిత్రక విమర్శ రూపుదాల్చింది.

ఈ ప్రారంభదశలో విమర్శ కేవలం అలంకార లక్షణ శాస్త్ర బద్ధమని భావించటం కన్పిస్తుంది. శుద్ధ అలంకారిక లక్షణ దృష్టి కలిగి ఉండటం వల్ల "అభిరుచి విమర్శ" దృక్పథానికి కూడా ఈ యుగం ప్రారంభమే.

3. "ఆనాడు ముఖ్యంగా విమర్శకులనిపించుకొన్నవాళ్ళు మనసు పక్కకు నెట్టి బుద్ధిని అమితంగా పెంచుకొన్నపండితులు వారికి కనబడేవి-లక్షణ గ్రంథాలే కాని లోకం కాదు. శుష్క భాషా వివాదాలే విమర్శలనిపించుకొనేవి".

## 2. పరిణామ దశ :

ఈ యుగంలో పాశ్చాత్య ప్రభావం స్పష్టంగా కన్పిస్తుంది. విమర్శ నవ్యమార్గంలో పయనించటానికి పరుగులు తీసింది. కట్టమంచి, రాళ్ళపల్లి, దువ్వూరిగార్లను ప్రధానంగా ఈ పరిణామదశలో పేర్కొన వచ్చు. ఒక ప్రత్యేక దృక్పథం నూతన సిద్ధాంతం, ప్రయోగం, వినూత్న దర్శనం కల్గి నవ్య మార్గ నిర్మాతలుగా నిలుస్తున్నారు.

కట్టమంచివారి ఆద్యత్వాన్ని కొందరు సంశయిస్తున్నా, -

4. "కవిత్వ తత్వ విచారము వెలువడినది మొదలు అనుకూల ప్రతికూల స్పందనలు కలిగించుచు ఆధునిక సాహిత్య విమర్శ రంగమునందు తన ప్రభావమును వ్యాపింపజేసినది. మరియు తెలుగు సాహిత్య విమర్శకు తన నాద్యముగా, రామలింగారెడ్డి గారిని ప్రథమాచార్యులుగా పలువురు భావించునట్లు చేసినది."

కట్టమంచివారి 'కవిత్వ తత్వ విచారం' వారిని ఆద్యులుగా చేసిం దనటం నిర్వివాదాంశమే. స్వేచ్ఛతో కూడిన విమర్శనావిధానాన్ని లోకానికి అందించారు.

పూర్వం వ్యాఖ్యానరూపంలో ఉన్న విమర్శను కావ్యార్థాలను విలువకట్టే నవ్య రూపంలోకి మార్చారు. మీమాంస స్పృహకు ప్రాధాన్యా న్నిచ్చి పాశ్చాత్య ప్రమాణాలతో ప్రాచీనాంధ్ర కావ్యానుశీలనం చేశారు. వీరిలో అభిరుచి విమర్శన విధానం నవ్య సిద్ధాంత ప్రతిపాదన దృష్టితో, పారిభాషిక పదసృష్టితోను, సాపేక్ష ప్రమాణాలతో నూత్న సమన్వయాలను చేయటంగాను సాగింది.

కట్టమంచివారు ప్రతిపాదించిన అంశాల్లో 'భావనాశక్తి' ఒకటి. ఇది ఆంగ్ల విమర్శలో వర్డ్స్వర్త్ (Words worth) ప్రతిపాదించిన ఇమాజి నేషన్ (Imagination)కు సన్నిహితంగా ఉంది.

5. "భావనా శక్తి యనగా విషయములు మనస్సులో బ్రతిబించు నట్లు చేయు సామర్థ్యము. ఒక బ్రతిబింబిచుట యననేల? బ్రత్య క్షముగా నవతారము ఎత్తునట్లు చేయుట"

ఈ విధమైన భావనా శక్తిని ప్రాచీన సాహిత్యంలో అన్వేషించ టంలో "అభిరుచి విమర్శ" ప్రవర్తిల్లింది. అయితే ఈ భావనాశక్తి అలం కార శాస్త్రాలు ప్రతిపాదించిన ప్రతిభలో అంతర్భూతం చెందుతుందని అభి ప్రాయ పడుచున్నారు.

6. "రెడ్డిగారు ప్రధానీకరించి వివరించి ప్రతిపాదించిన ఈ 'భావనా శక్తి' సరిగా పర్యాలోచించినచో భారతీయ సాహిత్య విమర్శ మార్గమున సిద్ధాంతీకరించబడిన 'ప్రతిభ' లోనే అంతర్భవించుట స్పష్టమగును."

ఈ భావనా శక్తిని ప్రతిపాదించడంలో అటు పాశ్చాత్య దృక్ప థంతో ఇటు అలంకారిక విమర్శ పునాదిగా నిలిచి శాస్త్రీయత, ప్రామాణి కతను సంతరించుకొంది.

ప్రబంధ ప్రక్రియ పూర్వ సాహిత్య ప్రక్రియలతో నిర్మాణాదులతో భేదం స్ఫుటంగా కల్పిస్తున్నా, కట్టమంచివారు

7. "ప్రబంధము లేమో నూతనమయిన మహా సృష్టియని మన పూర్వులు భ్రాంతి గొన్నట్లున్నది.. నా కుంజూడ బ్రబంధము లును భారతాదుల గొంత బోలియున్నవి. గాని పరమా పూర్వ ములు గావు."

ప్రబంధాలు భారతాదులకన్నా కొంచం భేదం మాత్రమే ఉన్న విగా భావించారు. భేదం కల్పిస్తుందని అంటూనే కొత్తవి కావు అనటంలో వీరి అభిరుచి ధోరణి స్పష్టమౌతోంది. ఈ విధంగానే ప్రబంధాల్లో కథై కృత లేమ. ప్రబంధాల్లో అలంకారాలు భావతీవ్రతకు ఆటంకాలు అని, ప్రబంధాల్లో నాటక సరణి మృగ్యమని, మొ॥న సిద్ధాంతాల్ని వారు ఏర్పరచు

కొన్ని ఈ మార్గంలో గుణ దోషాల్ని విచారణ చేశారు. కట్టమంచివారు వైయక్తిక దృక్కోణంనుండి నిర్ణయాలు చేశారు. విపర్శలో తన మనస్సుకుకూడా స్థానం కల్పిస్తూ అభిరుచిధోరణి విమర్శ వెలయించారు.

దేశీయ భావన ప్రధానంగా కలిగి పాశ్చాత్య ప్రమాణాల దృష్టితో విమర్శ సాగించిన వారిలో రాళ్ళపల్లివారు ఒకరు. ప్రాచ్య ప్రాశ్చాత్య ధోరణులతో సమన్వయిం చేస్తూ అభిరుచిని ప్రకటించారు. 'రస' శబ్దాన్ని సౌందర్య శాస్త్రదృష్టితో (Aesthetics) నిర్వచించారు.

8. "కవి భావనా బలముచే తనకుఁగలుగు శోకము, మోహము, అసూయ, ద్వేషము, సంతోషము, ప్రణయము మొదలగు భావములఁబడు చిత్త వికారముల మూలమున వర్ణించవలసిన పదార్థముల స్వరూపమును నిర్ణయించి విగ్రహమును (ఏ విగ్రహమయినను సరియే) సరళమగు భాషతో (దీర్చి ఎదుట నిలిపినపుడు రసానుభవ సంస్కారముగల సహృదయుల కట్టి మనోవికారములే కలిగి అవి యెట్టివైనను, శిల్పమందుగల యొకానొక అనిర్వచనీయ మహిమచే ఆనందముగా (బరిణమించును. ఈ అర్థమందే ప్రకృతము రసపదమును నేను ప్రయోగించెదను."

రసపదనిర్వచనం లాక్షణికులు నిర్వచించిన దానికన్నా భేదం స్పష్టంగా కన్పిస్తోంది. నవ్యరీతిలో నిర్వచించటమే వీరి అభిరుచి విమర్శన విధానం.

ఇక దువ్వూరి వారిలో రస రామణీయకాలను ప్రతిపాదించటంలో అభిరుచి ముఖ్యపాత్ర వహిస్తోంది.

9. పండితరాయలు రసమునందు రామణీయకమున్నదని నుడివినాడు. అంతకన్నా రామణీయకమునందు (రమణీయ భావమునందు) రసమున్నదని చెప్పుట సమంజసముగ నుండును."

రామణీయకమున్న చోటనే రసముంటుందనే దువ్వూరివారి అభిప్రాయం విమర్శక లోకం సమంజసమైనదనే గుర్తిస్తున్నా-

10. "రామిరెడ్డిగారు రమణీయకముండెడు ప్రతి స్థలమందలి ఆహ్లాదమునే రసముగా భావించినారు. కావుననే రామణీయకమునందు రసముండునని చెప్పుట సమంజసమనుట."

ఈ పరిణామ దశలో 'అభిరుచి' నవ్య సిద్ధాంతాలతో, సమన్వయాలతో వ్యాఖ్యాన దశనుండి కావ్య సమగ్ర తత్వదర్శనం వైపుకు మళ్ళింది. కట్టమంచివారిలో ప్రకటితమైన అభిరుచి ధోరణి వస్తువుకు కొంత దూరంగానే ఉంటుంది. కాని రాళ్ళపల్లి, దువ్వూరిగార్లలో వస్తువునాశ్రయించి ప్రాచ్య పాశ్చాత్య సిద్ధాంతాల నేపథ్యంలో ప్రామాణికతను సాధించింది. ఈ అభిరుచిధోరణే పరిణతిదశలో శిల్పానుశీలనమై నూత్నమార్గంలో అభివ్యక్తమైంది.

## 3 పరిణతి దశ :

కవిత్వ తత్త్వ విచారంతో మొదలైన అభిరుచిధోరణి ఆత్మాశ్రయతను తగ్గించుకుంటూ పరిణతి దశలో శిల్పాన్ని ఆశ్రయిస్తూ వస్త్వాశ్రయంగా సాగింది. పూర్వదశలో తమ సిద్ధాంతాలద్వార కావ్యాన్ని వివేచించారు. కాని కావ్యంద్వారా వ్యక్తమయ్యే అంశానికి ప్రాధాన్యత నివ్వలేదు. ఈ పరిణతి దశలో వస్తువు ముఖ్యం దాని తత్వాన్నిబట్టి లక్షణాలు ఏర్పరచటం, వస్తువునాశ్రయించే విమర్శకుని అభిప్రాయాలు వ్యక్తం చేయటం జరిగింది. ఈ విధమైన అభిరుచి ప్రకటనకు విశ్వనాథవారే ఆద్యులు. కట్టమంచివారు తమ అభిరుచి ధోరణితో వస్తువును దర్శిస్తే, విశ్వనాథవారు వస్తుతత్వాన్ని ఆలంబనం చేసుకొని అభిరుచిని వ్యక్తీకరించారు. అదే శిల్ప విమర్శగా రూపొందింది.

శిల్ప విమర్శలో విమర్శకుడు వస్తువును సక్రమంగా దర్శించి అనుభవించగలగాలి. నిర్ణయాలకు, సిద్ధాంతాలకు విమర్శకుని అనుభవమే మూలం. ఒకే కావ్యంపై భిన్న అభిప్రాయాలు విమర్శకులు వ్యక్తం చేయవచ్చు. శిల్పాన్ని ఆశ్రయించి వస్తువును వీడని అభిప్రాయాలు శాస్త్రీయతను

పొందుతాయి. ఈ శిల్పానుశీలనంలో విమర్శకుని స్వీయానుభవం మూలం కావటం వలన అభిరుచి ధోరణిలో దీన్ని ఒక కోణంగా గుర్తించవచ్చు.

విశ్వనాథ వారి విమర్శన గ్రంథాలన్నీ శిల్పానుశీలన దృష్టితో సాగినవే. వీరి ప్రతి రచన ప్రత్యేక వైవిధ్యంతో కూడినదే, "ప్రసన్న కథా కవితార్థయుక్తి"లో కావ్య కథా శిల్పం, ఉపఖ్యాన శిల్పం అనేవి కావ్యంలో ఏ విధంగా ప్రవర్తిల్లుతాయో నిరూపిస్తూ వస్తుధ్వని రసధ్వనిలో పర్యవసించే లక్షణాన్ని నిరూపించారు.

11. "ఈ రచనాశిల్పం అనంత విధములుగా నుండవచ్చును.
ఒక చోట వృత్తముల నాశ్రయించి యుండవచ్చును.
ఔచిత్య వేత్తలు వృత్తౌచిత్యమనవచ్చును."

వస్తువు నాధారంగా నిర్మాణాదులవల్ల వ్యక్తమయ్యే రచనా శిల్పాన్ని వివేచించడంలో అభిరుచి ధోరణి కన్పిస్తుంది.

'ఒకడు నాచన సోమన' గ్రంథంలో ప్రబంధాల్లో 'ఐక్యతకన్నా' 'ఏకవాక్యత' ఉంటుందని ప్రతిపాదించాడు. ఇందులో ఖగోళ శాస్త్రాది విషయాల ప్రతీకాత్మక ప్రవృత్తిని నిరూపించటంలోను అభిరుచి వ్యక్తమైంది.

ఈ విధంగానే 'మనుచరిత్ర'లో జీవనపరిణామ సిద్ధాంతం దృష్ట్యా వ్యాఖ్యానం చేశారు. కావ్యపరిమళంలో అనేక ప్రబంధాలపై వ్యాఖ్యానం చేస్తూ అభిరుచి అభిప్రాయాల్ని వెల్లడించారు.

ఇక ఆధునిక ప్రక్రియ భావ కవిత్వంపై నిర్వచనం వస్త్వాశ్రిత అభిరుచి విమర్శకు చిహ్నం.

12. "కవియొక్క అవిస్పష్ట వాంఛాంకురము, ఒక అంతర్నిగూఢ తాపము ఒక కావ్యంలో ఊదబడినచో అది భావ కవిత్వము"

పై నిర్వచనం భావకవితా స్వరూపాన్ని దర్శింప జేస్తోంది. ఈ విధంగా విశ్వనాధవారు అభిరుచి ధోరణిలో విమర్శ సాగించారు.

పింగళి లక్ష్మీకాంతం గారు సాహిత్య శిల్ప సమీక్షలో పాశ్చాత్య పారిభాషిక పదాలను ప్రయోగించటంలో కట్టమంచివారికన్నా ఒక అడుగు ముందుకే వేశారు. ప్రాచ్య పాశ్చాత్య వైఖరులను సమన్వయించే ధోరణితో పద ప్రయోగ స్వభావమే వీరి అభిరుచి ధోరణి.

పాశ్చాత్య దృక్పథంతో సమన్వయాన్ని చేస్తూ తనకంటూ కొన్ని సిద్ధాంతాలు, అభిప్రాయాలు ఉన్నవారు ఆర్.యస్. సుదర్శనం గారు.

13. "నా మటుకు నాకు రసమంటే Unit of mood అని నిర్వచించుకోవచ్చునేమో అని తోస్తుంది. ఒక విశిష్టమైన మనఃస్థితిని నాలో కల్గించగల రచనా భాగాన్ని లేక కావ్యాన్ని రసవంతమైనదిగా చెప్పవచ్చు."

పై అభిప్రాయంలో వైయక్తికతతో పాటు పాశ్చాత్య విధానంతో తులనాత్మక భావాన్ని తెలుపుతోంది.

14. కాలంలో అభిరుచులు అభిప్రాయాలు మారుతాయి. సాహిత్య రచనలో మార్పులు క్రొత్త పోకడలు వస్తాయి. సాహిత్యాన్ని విమర్శించి వ్యాఖ్యానించేమార్గాలు భిన్నంగా రూపొందవచ్చు కాని, రచయిత దృక్పథానికి అతని రచనకి గల సంబంధం ఒక నిశ్చిత ప్రమాణం రచన మనసులో కలిగించే అనుభూతిద్వారా ఆ సంబంధాన్ని తెలుసుకొని వివరించటానికి చేసే ప్రయత్నమే సాహిత్య విమర్శ"

సాహిత్య విమర్శలో ప్రమాణాలు కాలంతోపాటు మారుతాయి. క్రొత్త పోకడల్ని విమర్శించటానికి విమర్శకుని అభిరుచి ధోరణిలో రూపొందే సాపేక్షవిలువలే ఆధారం. ఈ విధంగా సాపేక్ష విలువల్ని

గుర్తించటంవల్ల అభిరుచి విమర్శ కాలానుగుణంగా ఏర్పడుతుందని భావిస్తు న్నారని చెప్పొచ్చును.

## 4. ప్రయోగ దశ :

ప్రయోగ దశలో పాశ్చాత్య సిద్ధాంతాల నేపథ్యంలో సాహిత్యాను శీలనం ప్రారంభమైంది. వాటిలో ముఖ్యమైంది ప్రాచుర్యాన్ని పొందింది మార్క్సిస్టు ధోరణి విమర్శ. ఇందులో 'సామాజిక స్పృహ' మొదలు 'కమిట్ మెంట్' వరకు అనేక సిద్ధాంతాలతో విమర్శలో ప్రయోగాలు ఏర్పడ్డాయి, ఈ విధంగా సిద్ధాంత నేపథ్యంతో సాగే విమర్శలో అభిరుచికి స్థానం ఉండ కూడదు. కాని విమర్శకుడు మౌలికంగా అనుభూతి చెందే గుణం కల వాడుగా ఉంటాడు. అందుచే స్వీయాభిప్రాయాలు వ్యక్తం అయ్యేందుకు అవకాశం లేకపోలేదు. సిద్ధాంత నేపథ్యం ఉన్నా అభిరుచి ధోరణి ఉంటుం దనేది నిర్వివాదాంశం.

మార్క్సిస్టు ధోరణి విమర్శకుల్లో రా. రా. (రాచమల్లు రామ చంద్రారెడ్డిగారు) గారి దృష్టిలో సిద్ధాంతంతో పాటు శిల్పం కూడా ముఖ్యం అనే అభిప్రాయం కన్పిస్తుంది

15. "వస్తువుకు మాత్రమే విలువనిచ్చే శిల్పాన్ని నిర్లక్ష్యం చేయరాదు. శిల్పంవల్ల అనుభూతి కలుగుతుంది. అను భూతుల ద్వారానే సాహిత్యం మన సంస్కారంలో మార్పులను తెస్తుంది."

రచనలో శిల్పం మానసిక పరిణామానికి దోహదం చేస్తుందని మార్క్సిస్టు విమర్శ అంగీకరించదు. వస్తువే ముఖ్యం అంటారు.

16. "శిల్పం, అనుభూతులవలన సంస్కారం రాదు. రచయిత భావాలవల్లనే సంస్కారం వస్తుంది".

రచనలో బలంగా రచయిత భావాల్ని గుప్పించటం వల్లనే పాత

కునిలో సంస్కారం వస్తుందనే వాదం కూడా వినిపిస్తోంది. రచనలో అనుభూతి పరమైన భావాలు ఉండాలా, అవసరంలేదా అనే అంశంపై విమర్శకులు వారి వారి అభిరుచి ధోరణిలో విమర్శలు చేస్తూనే ఉన్నారు.

అధునిక సాహిత్య విమర్శకు శ్రీ శ్రీ అందించిన సూత్రం నేటి కాలంలో కవిత సంవిధానంతోను కవిత్వంతోను నిండి ఉంటేనే ఆదరం లభిస్తుందని చెప్తోంది. అధునిక కవితను అనుశీలించటానికి కూడా సూత్రంగా ఉంది.

1. — కవిత్వం
— సంవిధానం

2. — కవిత్వం
+ సంవిధానం

3. + కవిత్వం
— సంవిధానం

4. + కవిత్వం
+ సంవిధానం

ఈ సూత్రాలవల్ల కవిత్వంలో ఏది లోపించినా అది నీరస కవిత్వమే అవుతుంది. కవిత్వంలో సంవిధానం అనేది తప్పనిసరిగా ఉండాలనేది శ్రీ శ్రీ అభిరుచి ధోరణే.

విమర్శలో ప్రయోగాన్ని నిర్వచించిన వారిలో కుందుర్తి ఒకరు. అభ్యుదయ కవితోద్యమరోజుల్లో వస్తువుకు ప్రాధాన్యత నిచ్చారు. ఉద్యమ తీవ్రత చల్లార్చిన తర్వాత రూపం, రీతి, శిల్పాలకోసం ప్రాకులాడుతున్న తరుణంలో కుందుర్తి మరలా కథాకావ్యాలు రావాలని ప్రతిపాదించారు. వచన కవితలో ఆలంకారిక భాషవల్ల రూపనిర్మాణాదుల వల్ల వచ్చే అస్పష్టతను తొలగించాలని భావించారు. అయితే కధాకావ్యసిద్ధాంతం పాఠకుని తిరోగమనానికి దారితీయిస్తోందని భావించారు.

18. పాఠకునిలో రసోత్పత్తి జరగాలంటే కథ ఉండాలని పూర్వుల ఉద్దేశం..., కాని పాఠకుని కవితాస్వరూపం నిశితమైనకొలది, భావనాత్మకమైన కొలది అటు పాఠకుని మనఃస్థితికూడా నైశిత్యాన్ని పొందింది."

నేటి పాఠకునిలో కవితాస్వాదన శక్తి పెరిగిందని కథాకావ్యాలు

అవసరం లేదని భావించారు తిలక్. కాని కథాకావ్యాలు గురజాడనుండి మొదలై నేటివరకు వెలువడుతూనే ఉన్నాయి. ఏమైనా నవ్యత రావాలని కోరుకునే ప్రయత్నం కన్పిస్తుంది.

ఆధునిక సాహిత్య విమర్శలో ప్రతీకాత్మక విమర్శ వెలువడటం ఒక ప్రయోగమే. ఈ విమర్శలో కవి స్వీయంగా ప్రతిపాదించే ప్రతీకలు, విమర్శకుడు తన అనుభవంతో ప్రతిపాదించే ప్రతీకలు అని రెండు రకాలు చెప్పవచ్చు. ఏవైనా కావ్యంతో ఆ భేదాన్ని కల్గి ఉంటే రాణిస్తాయి. ఈ ప్రతీకలు అభిరుచి ప్రధానమైనవే. ఈ ప్రతీకాత్మక విమర్శలో విశ్వనాథ, జి.వి. సుబ్రహ్మణ్యం, శేషేంద్ర సుప్రసన్న, ఆర్. ఎస్. సుదర్శనం మొదలైన వారిని ప్రముఖులుగా పేర్కొనవచ్చును.

విశ్వనాథ నాచన సోముని 'హరివంశం'లో ఖగోళశాస్త్ర విషయాల్ని ప్రతీకాత్మకంగా పోషించారని నిరూపించారు. శేషేంద్ర 'షోడసి'లో రామాయణ రహస్యాలను చెపూ కుండలినీ యోగాన్ని చూపించారు. జి. వి. సుబ్రహ్మణ్యంగారు ప్రభావతీ ప్రద్యుమ్నంలో రస స్వరూపాన్ని విజయవిలాసంలో ధ్వని స్వరూపాన్ని పాత్రలలో వివేచించారు. ఆధునిక కవిత్వంలో శ్రీశ్రీ పౌరాణిక ప్రతీకలను నిరూపిస్తూ 'అవతారం' ఖండిక.

> 19. "ఆధునికాంధ్రసాహిత్యంలో అభ్యుదయ కవితావిష్కారం నూత్న ప్రయోగంగా ఆవిష్కరిస్తున్న రోజులవి దీన్ని శ్రీశ్రీ సూచించారు...కొత్త సృష్టి జరుగుతున్న సమయంలో ?నవచ్చిన వింత సప్తస్వరాలను అవతారం గేయంలో ప్రతీకాత్మకంగా ధ్వనింపజేసాడు."

- అని తాము చెప్పిన ప్రతీకాత్మకతకు గేయంలో చెప్పిన అంశాలలో సమన్వయాన్ని చూపిస్తూ ప్రామాణికతను సాధించినట్లు కన్పిస్తోంది.

సుప్రసన్న వసుచరిత్రలో "ఇంద్ర వృత్రాసుర వృత్తాంతం" ఇమిడి ఉందని నిరూపించారు. ఆర్.ఎస్. సుదర్శనంగారు మనుచరిత్రలో ప్రవ

రుడు ఆత్మగాను, వరూధిని అనుభూతిగాను మనోరమ బుద్ధిగాను, విభావసి మనస్సుగాను, స్వరోచి తేజోనిధిగాను ప్రతీకాత్మకంగా చిత్రించబడ్డారని వివేచించారు తుమ్మలపూడి కోటేశ్వరరావుగారు విశ్వనాధవారి ఝాన్సీ రాణిలో యుద్ధాన్ని దేవాసుర సంగ్రామంగా ప్రతీకాత్మకంగా ఉందని సూచించారు.

విప్లవ సాహిత్య విమర్శ మార్క్సిస్ట్ సిద్ధాంత ప్రాతిపదికతో మొదలైంది. వీరితో సంప్రదాయ నిరసన, వ్యక్తిగత అనుభూతుల నిరసన లతో ప్రధానంగా సాగుతోంది.

20. "తిరోగామి భావాల సంస్కృతుల ఛాయలు రేఖామాత్రంగా కూడా లేకుండా నిర్మూలించడమే విప్లవ సాహిత్య ధ్యేయం."

అనాదిగా వస్తున్న సంప్రదాయ, సాంస్కృతిక విశేషాలు వైయక్తిక అభిప్రాయాలు సామాజిక ప్రయోజన రహిత సాహిత్యాన్ని నిరసించటం వీరి ప్రధాన అభిరుచి.

ప్రయోగ దశలో సాహిత్యేతర సామాజికాది సూత్రాలతో విమర్శ చేయడంలో అభిరుచి నవ్య దృక్పథంతో శాస్త్రీయంగా అభిప్రాయాల్ని వ్యక్తీకరించాలనే అభిరుచి అ రెండు రకాలుగా గుర్తించవచ్చు. మార్క్సిస్ట్ ధోరణి విమర్శ కేవలం వస్తు దృష్టితో సామాజిక స్పృహతో ఉండాలంటుంది. సామాజిక స్పృహతోపాటు సాహిత్య స్పృహ, ఆత్మకళలు కూడా ప్రకటించబడాలని కవిసేన మేనిఫెస్టో ప్రకటిస్తోంది.

మరికొందరు పాశ్చాత్య సూత్రాల అన్వయంతో ప్రయోగాలను నిర్వహిస్తూ శాస్త్రీయతను సాధించటం కనిపిస్తోంది. ఏమైనా సిద్ధాంతపు నేపథ్యంతో విమర్శకుల అభిరుచిని సంవదించుకొంటూ అభిరుచి ప్రయోగాత్మక అభిరుచిగా ప్రస్థానాన్ని సాగించింది.

మిశ్రదశ

1980 నుండి విమర్శలో క్రొత్తధోరణి కనిపిస్తోంది. భిన్నభిన్న

మార్గాల్లో విమర్శ చేయటంలో చాతురిని చూపుతున్నారు. అనుభూతి వాద విమర్శ కొత్తగా రూపొందింది. ఈ దశాబ్దపు విమర్శన సిద్ధాంతంగా దీన్ని చెప్పవచ్చు.

నేడు అలంకారిక, శిల్ప, అనుభూతి వాద విమర్శలు ఒక ధోరణి గాను కనిపిస్తున్నాయి. కొన్ని సందర్భాల్లో మిశ్రమ రూపంలోకూడా విమర్శ కానవస్తుంది. ఈదశ 1975 నుండి అరంభమైనట్లు ఉన్నా 1980 నుండి ప్రాచుర్యాన్ని పొందింది. మిశ్రరూప విమర్శ భిన్న సిద్ధాంతాల ఐక్యతకోసం పాటుపడుతున్న ధోరణి కూడా కనిపిస్తుంది. ఈదశ సాహిత్య పరిణామంలో ఒక మైలురాయిగా భావించవచ్చును.

## ఆధునిక సాహిత్య విమర్శ అభిరుచి ధోరణి 1980-87

(1) "In every age impressionism (or enjoyment) and dogmatism (or Judgement) have grappled with one another. They are two sexes of criticism ?"

ఆనంద దాయకంగా ప్రయోజనాత్మకంగా ఉండటం సాహిత్య తత్త్వం అయితే ప్రతియుగంలోను విమర్శ ఆనందాన్ని కల్గిస్తూ తీర్పని చెప్పటం దీని స్వభావం. అందుకే సాహిత్య విమర్శ కళగాను, శాస్త్రం గాను భాసిస్తోంది విమర్శకుడు ఒక ప్రక్క పూర్వశాస్త్ర ప్రమాణాలు, మరొక ప్రక్క స్వీయ అనుభవ ప్రామాణికత్వం అనే ఈ రెండింటి మధ్య సాహిత్యాన్ని అనుశీలిస్తున్నాడు. అయితే ఏ ప్రమాణాలకు అయినా విమర్శ కుని అనుభవమే మూలం.

అలంకారిక విమర్శ, ఆధునిక విమర్శ అనే భేదం నేడు స్పష్టంగా కనిపిస్తోంది. అలంకారిక విమర్శలో ప్రమాణాలు మానవ మనోవికారాదుల

సాధారంగా ఏర్పడ్డాయి. ఆధునిక కాలంలో ఏర్పడ్డ కవిత్వానికి ఆ సూత్రాల సమన్వయం కుదరటం లేదు. ఈ పరిణామం దృష్ట్యా ప్రాచీన సూత్రాలలో నవ్యతను సాధిస్తూ కొందరు నవ్య సంప్రదాయాన్ని వెలువు స్తున్నారు. కొత్త కవిత్వానికి కొత్త సూత్రాలు కావాలని ఆయా కావ్యాల అనుగుణంగా లక్షణాల్ని చెప్పటం, ప్రక్రియాలక్షణ సూత్రాల్ని నిర్మించటం కనిపిస్తుంది. కొందరు కవితావిర్భావానికి రాజకీయ సామాజిక, ఆర్థిక కారణాలే మూలమని భావిస్తూ ఆయా సూత్రాల అనుగుణంగా విమర్శ సాగాలని కొత్త విమర్శని సృష్టిస్తున్నారు. అయితే వీరి భావ వ్యక్తీకరణకు వీరి అనుభవమే మూలం కావటంచే విమర్శలో అసంకల్పితంగా తానొక పాత్రగా ఉంటున్నాడు.

(2) "Every one has impressions in the face of litarary experience and may are compelled to recoard them there value depends up on the taste, knowledge and writing ablity of the critic".

సాహిత్య విమర్శకుడు కావ్య రుచితోపాటు తన అభిరుచిని ప్రకటించకుండా ఉండటం అనివార్యం. అభివ్యక్తి విలువ అతని సౌందర్యాను భవ సాంద్రత మీద, తన వాదాన్ని సమర్థించుకొనే పాండిత్యం మీద ఆధారపడి ఉంటుంది.

నేడు సాహిత్య విమర్శ మూడు పద్ధతుల్లో ప్రధానంగా సాగుతోంది.

(3) ఈనాటి విమర్శనా ధోరణుల్ని గురించి ఆలోచిస్తే మనకు ప్రధానంగా కనిపించేవి మూడు పద్ధతులున్నాయి. ఒకటి సంప్రదాయ విమర్శన పద్ధతి. దాన్నే అలంకారిక విమర్శనా ధోరణి అంటాము...రెండవది పాశ్చాత్యశిల్ప విమర్శనా ధోరణి.... ఇక మూడవది మార్క్సిస్టు విమర్శనా విధానం"

పై మూడు పద్ధతులే కాక నిర్మాణవాద, రూపవాద, మానసికశాస్త్ర అనుభూతివాద లేదా సౌందర్యవాద, ప్రతీకాత్మకవాదం మొదలైన పద్ధతులు కూడా అమలులో ఉన్నాయి. శిల్ప విమర్శలో ఏ కావ్యానికా కావ్యానికి సూత్రాలు ఏర్పరచుకోవాలి. విమర్శకుని ప్రతిభనుబట్టి కావ్య తత్వాన్ని ప్రదర్శించటం ఇందులో ప్రధానంగా కనిపించటం వలన ఇది విమర్శకునికి గుర్తింపు తెస్తుంది, అలంకారిక విమర్శనా పద్ధతిలో కావ్యానుగుణమైన మార్పులను గుర్తిస్తూ అవసరమైన సూత్రాలను మాత్రం గ్రహించి అనుశీలించటం, ఆ సూత్రాలు త్రికాలబాధితాలని భావించి ఆ దృక్పథంలో లేని కావ్యాలను విమర్శించటం అక్కడక్కడ కనిపిస్తుంది. ఈ విధానానికి సూత్రాలు ముందే ఏర్పడి ఉంటాయి. కొన్ని సూత్రాలలో పదాలకు అర్థాలు మారటం అలంకారిక విమర్శలో కనిపిస్తుంది, అంటే అలంకారిక విమర్శలో కూడా పునర్నిర్మాణాత్మకత కనిపిస్తుంది. ఇక మార్క్సిస్ట్ విమర్శకు నిర్దిష్టమైన సూత్రాల నిర్మాణం ఉంది, అయితే విమర్శకుడు సహజంగా స్పందన చెందే గుణం కలవాడు కావటంచే తన అనుభవాల్ని వ్యక్తీకరించటంలో స్వీయమార్గాన్ని నిర్మిస్తాడు. విమర్శకుని ఆలోచనా విధానం అతని అనుభూతి వ్యక్తీకరణ ఈ విధానంలో స్వీయ వ్యక్తిత్వాన్ని తెలుపుతుంది. ఇక అనుభూతి, ప్రతీకాత్మక విమర్శలు విమర్శకుని స్వీయ అనుభవ ప్రతిభల పైననే ఆధారపడి ఉంటుంది.

విమర్శలో విమర్శకుని అనుభూతికాని భావాలుకాని వ్యక్తీకరింపకుండా కేవలం సూత్రానుశీలనం చేయాలనే విధానాన్ని వస్తు విమర్శ (Objective criticism) అని; సూత్రాలతోపాటు విమర్శకుని స్వీయ అనుభవాన్ని వ్యక్తీకరించటాన్ని భావ విమర్శ (Subjective Criticism) అని రెండు రకాలుగా ఉన్నాయి. కావ్య నిర్మాణం కవియొక్క ఆత్మాశ్రయత దీన్ని అనుశీలిస్తూ విమర్శకుడు స్పందించకుండా గట్టుమీదనిలబడి సముద్రాన్ని వర్ణించినట్లు చెప్పాలనే దృష్టిని వస్తు విమర్శ (Objective criticism) విమర్శకుడు తన స్పందనను స్వీయంగా వ్యక్తీకరించటం భావవిమర్శ (Subjectivity) అని అంటున్నారు. కాని కొంత లోతుగా

ఆలోచిసే ప్రతి సిద్ధాంతం ప్రతి విమర్శ భావ విమర్శగా (Subjectivity) ఉంటోంది.

(4) "జ్ఞానం నిష్పాక్షికమైనా దాని అన్వేషణ ఆత్మిక సాహస యాత్ర Subjectivity, objectivity అనేవి రెండు కూడా ఒక దాని యొక్క మరొక భంగిమే అవుతాయి. కారణం Objective ని అర్థం చేసుకున్న వాడు కూడా Subjective వాడు అప్పుడు Objective కాలేడు కాని Objective అయ్యానని అనుకుంటాడు."

పై అభిప్రాయం విమర్శ ఏ రూపంలో ఉన్నా అది విమర్శకుని అనుభవాన్ని వ్యక్తీకరించాల్సినప్పుడు గతానుగతికంగా వస్తున్న సూత్రాలను సంప్రదాయాలను వ్యతిరేకించేటప్పుడు అభిరుచివిమర్శ రూపొందుతుంది.

నేటి అభిరుచి విమర్శ క్రొత్త సిద్ధాంతాలకన్నా క్రొత్త సమన్వయాలు, విశ్లేషణలు, అభిప్రాయ భేదాలుగా, వాదోపవాదాలుగా ఉంది. పరిణామం చెందుతున్న సాహిత్యాన్ని ప్రాచీనాలంకారిక సూత్రాలతోనే అనుశీలించటంలో విమర్శకుని ఆలంకారిక ప్రీతి కనిపిస్తుంది. ఆధునిక సూత్రాలతో స్వీయ సిద్ధాంతాలను ఏర్పరచటంగాను, ఆలంకారిక విమర్శలో నవ్యత్వాన్ని తేవటంగాను, విశ్లేషణ చేస్తూ కవితా తత్వాన్ని ప్రకటించటంగాను విమర్శలో వివిధరూపాలతో అభిరుచి వ్యక్తీకరించబడుతోంది. మొత్తం మీద తెలుగు సాహిత్య విమర్శలో అభిరుచి విమర్శనా విధానాన్ని పరిశీలిస్తేవిమర్శకుడు పొందిన స్పందనను అనుభవ ప్రమాణంతో లక్షణ గ్రంథాలలో లేని లక్షణాలను సృష్టించి వాటిని విశ్వజనీనంగా అభివ్యక్తీకరించాలని ప్రయత్నించటమే అభిరుచి విమర్శగా కనిపిస్తోంది.

నేటి అభిరుచి విమర్శకు ఈ క్రింది విధంగా వర్గీకరించవచ్చు.

అభిరుచి విమర్శ

| వ్యక్తిగత అభిరుచి | ప్రయోగాత్మక అభిరుచి | ప్రామాణిక అభిరుచి |
|---|---|---|
| 1. అలంకారిక ప్రీతి | 1. కావ్యలక్షణ ప్రతిపాదనాత్మకత | 1. ఆధునిక కావ్యాల్లో అలంకారిక మార్గం |
| 2. పాక్షికత | 2. విశ్లేషణాత్మకత | 2. ప్రక్రియాలక్షణ ప్రతిపాదనాత్మకత |
| 3. అభిమానావేశాలు | 3. ఆత్మాశ్రయత | 3. నిబద్ధతాత్మకత |
| 4. భావ వైరుధ్యం | 4. వాదాల్లో అభిరుచి | 4. అనుభూతివాదం |
| 5. స్వీయ కవిత్వసమర్థనం | 5. విమర్శలో కవిత్వాభిరుచి | 5. సమన్వయాత్మకత |
| 6. వ్యక్తిగత బలహీనతలు | 6. తులనాత్మక అభిరుచి | |

## I వ్యక్తిగత అభిరుచి

అభిరుచి విమర్శలో విమర్శకుని నిర్ణయాలు వస్తువును వీడి అతీతంగా ఉండరాదు. విమర్శకుడు పలువురు అంగీకరించలేని నిర్ణయాలుచేయటం, తనకు నచ్చిన వాళ్ళను మహాకవులని పొగడటం, విమర్శచేసేటప్పుడు సంయమనం, ప్రజ్ఞ లేకుండా, అభిప్రాయాలు విశ్వజనీనం కాకపోవడం మొదలైన ఈ ధోరణుల్ని వ్యక్తిగత అభిరుచిగా గుర్తించవచ్చు. విమర్శకుడు ఒక విధానంలో విమర్శ చేస్తూ ఆ స్థాయిని అందుకోలేక తన అభిప్రాయాన్ని వ్యక్తీకరించటం, విమర్శ మధ్యలో రవ్వలలాగా అభిప్రాయాల్ని అందించటం, తన కృతుల్ని, తన వాదాన్ని తానే సమర్థించుకోవటం మొదలైన వాటిని వ్యంజించేవి వ్యక్తిగత అభిరుచి.

## 1. అలంకారిక ప్రీతి

కాలంతో పాటు కవిత్వం మారుతోంది. దానికనుగుణంగా విమర్శ మారుతోంది కాని కొందరి విమర్శకుల్లో ఆధునిక కావ్యాన్ని ప్రాచీనాలంకారిక సూత్రాలతో అనుశీలన చేయటం నేటి విమర్శలో కనిపిస్తోంది. అలంకార శాస్త్రీలు త్రికాలబాధితాలని, ఎలాంటి సాహిత్యానికైనా కొలమానాదులుగా పనికొస్తాయనే భావన విమర్శకుని అలంకారిక ప్రీతిగా పేర్కొనవచ్చు. శ్రీశ్రీ మహాప్రస్థాన ఖండికను వ్యాఖ్యానిస్తూ —

(5) జీవితంపట్ల అంతర్ముఖంగా ప్రసరించే నిరీహ అహంకారం- ప్రసమనత్వం-వైరాగ్యభావం ఇందులో ప్రధానమైనధ్వని.

శ్రీ శ్రీ కావ్యానికి జీవప్రదమైనది ధ్వని. ఈ ధ్వని వైభవమే కావ్యాన్ని తారావథానికి ఎత్తి చూపిస్తుంది. మార్క్సిజం ఉందన్నా, పెట్టుబడి వ్యవస్థలో కలిగి నలిగి శిథిలమైన బానిస జీవితం కనిపిస్తుందన్నా, ఆర్షమతంలోని పరమసారం గోచరిస్తుందన్నా అది పాఠకుని వైయక్తిక మనస్తత్వాన్ని పురస్కరించుకొని ప్రభావితములైన అభిప్రాయ విశేషాలు మాత్రమే"

అలంకార శాస్త్రంలో ధ్వని సిద్ధాంతం కవిత్వపు శాశ్వత విలువపై ఆధారపడి ఏర్పడినది. ధ్వనివంతంగా ఉందనటాన్ని ఎవ్వరూ కాదనలేరు. కాని శ్రీశ్రీ సామాజిక నేవథ్యంతో కవిత్వం వ్రాసి ప్రజాకవి, మహాకవి అని పేరు పొందాడు. కాని దానికి విరుద్ధంగా శ్రీశ్రీ కావ్యానికి జీవమైంది ధ్వని అనటం కొంత సమంజసంగా ఉన్నా "మార్క్సిజం దృష్టి వైయక్తిక అభిప్రాయం" అనటం విమర్శకుని వ్యక్తిగత అభిప్రాయమైన అలంకారిక ప్రీతిని తెలియజేస్తోంది.

(6) అలంకార శాస్త్ర దృష్ట్యా ఆధునిక కావ్యాల్ని విమర్శించ

రాదనే పిడివాదంలో ఎంత సామంజస్యం లేదో ఆధునిక మైన విమర్శనా దృష్టితో పూర్వ కావ్యాలను చూడరాదనే దానిలోను సామంజస్యం ఉండదు"

—అని పేర్కొనటంలో విమర్శనా సూత్రాలు సార్వకాలికాలని భావించటం కనిపిస్తుంది. కాని కొన్ని సూత్రాలు అన్వయించవచ్చు. అవి సమగ్ర తత్వాన్ని అందించలేవు. ఇక్కడ విమర్శకుడు తన అలంకారిక ప్రీతిని సమర్థించుకున్నట్టుంది.

(2) పాక్షికత

సిద్ధాంతాలు కాని, సూత్రాలు కాని ఏర్పరచేటప్పుడు సమగ్రత్వం భాసించాలి. కొన్ని అంశాలు ప్రతిపాదిస్తున్నప్పుడు పాక్షికమైనవిగా ఉంటాయి. అటువంటి వాటిని పాక్షికమైన వైయక్తిక అభిరుచిగా పేర్కొనవచ్చు.

(7) "ప్రధాన వస్తువుతో ఒక తాత్విక చింతనతో, సందేశంతో, అనేక భావాలతో, మూడ్స్‌తో కథలేకుండా 'అర్బేనిటా' అనే లక్షణం కలిగి ఉండి, తగినంత విస్తారంగా ఉన్న దీర్ఘ కవితను ఆధునిక మహాకావ్యం అంటున్నాను"

ఈ నిర్వచనంతో కొలిచి చూస్తే కొయ్యగుర్రమే ఆధునిక మహా కావ్యంగా కనిపిస్తుంది. ఈ అభిప్రాయంతో ఏకీభవించని వాళ్ళు చాలా మంది ఉన్నారు.

(8) "ఆధునిక మహా కావ్యానికి "అర్బెనిటీ" అనే లక్షణాన్ని ఆపాదించటం ఘోరం. ''రూరల్" బ్యాక్‌గ్రౌండ్‌తో కావ్యం వ్రాస్తే మహాకావ్యం కాదా, అప్పకవి చెప్పిన కవిత్వ లక్షణంలాగా పాక్షిక దృష్టితో నిర్వచనాలు చేయబూనడం దుస్సాహసం"

ఈ మహాకావ్య లక్షణాలు నిర్ణయించడంలో పాక్షికమైన దృష్టితో ఏర్పరచినవిగా పలువురు గుర్తిస్తున్నారు. లక్షణాలు సార్వత్రికంగా ప్రక్రియను సాధారణీకరణంచేసి చూపేవిగా ఉండాలి. ఈ విధమైన నిర్ణయాల అసమగ్రతను పాక్షికమైన అభిరుచిగా గుర్తించవచ్చును.

(8) అభిమానావేశాలు -

ఒక కవిమీదనో, ప్రక్రియమీదనో, సిద్ధాంతంమీదనో, అభిమానంతో ఆవేశంతో విమర్శ చేస్తున్నప్పుడు శాస్త్రీయ దృష్టిని వదలి అభిరుచి విమర్శనా విధానం కనిపిస్తుంది.

(9) "రవి గాంచని చోటును
కవి గాంచెను.
కవి గాంచని చోటును
రవి గాంచును"-

పై పాదము లెంతటి సామాన్యములో అంతటి అసామాన్యములు రవి కవులకుపమించుటలో ఎంతో హృద్యముగా యున్నది. ఒకటి సిద్ధింప జేయునదైతే, వేరొకటి సాధింపజేయునది. ఇచ్చట పేర్కొన్న విషయమున వింత యిసుమంతయు లేదు. కాని అక్షర ప్రయోగ పారవశ్యమున దేవ్‌గారి మనఃకేదారము విచ్చుకున్నది.

ఈ విమర్శలో కవిని పొగడుతూ పూర్వం ఎప్పుడో ప్రబంధకాలంలో చెప్పిన చాటువునే దేవ్‌గారి స్వీయ రచనగా పేర్కొనటం విమర్శకుని అభిమానాన్ని ప్రకటిస్తోంది.

(10) మినీ కవితా నాగరకత ప్రతిఫలనం ఎందుకంటే
పత్రికల వాళ్ళ వ్యాపార దృక్పథం వల్లనే మినీ
కవితా పుట్టుకొచ్చింది. రెండపది ఉదేశ పూర్వకంగా

"ప్రజలు ఆదరిస్తున్న ఒక ప్రక్రియను పడగొట్ట-
టానికి నిశ్చయించుకోవటం. ఇందుకు పత్రికలను,
ప్రదర్శనలను, సమావేశాలను, పుస్తకాలను ఆధారం
చేసుకొని విప్లవ కవిత్వాన్ని ప్రజల్లో వ్యాప్తి
చెందాల్సిన అవసరం పోయిందని ప్రచారం సాగించటం."

విప్లవ కవిత్వంపై అభిమానంతో మినీ కవితపై చారిత్రక అవగాహన గాని, అదొక ప్రక్రియగా గాని గుర్తించకుండా, సానుభూతి లేకుండా విమర్శించటం కనిపిస్తోంది. ప్రచారంలో ఉన్న ప్రక్రియను పడగొట్టటానికి ఎప్పుడూ సాహిత్య ప్రక్రియలు రావు. పూర్వ ప్రక్రియలో నవ్యతా గుణమే నూతన ప్రక్రియ. ప్రక్రియ వ్యాప్తి చెందుతున్నదనటానికి పుస్తకాలు, సమావేశాలు, ప్రదర్శనలే ఆధారాలు. ఎక్కువమంది వ్రాస్తున్నారంటే ఆ ప్రక్రియ ప్రత్యేక మార్గంలో సాగుతోందని చెప్పవచ్చు. విప్లవ కవిత్వం ఒకరు అవసరం లేదని చెప్తే ఆగేది కాదు. అందుచేత విప్లవ కవితా ప్రక్రియను ఒక ప్రక్రియ నాశనం చేస్తుందనటం సామంజస్యంగా కనిపించదు. విప్లవ కవితాభిమానంతో ఇతర సాహితీ ప్రక్రియలను దుయ్యబట్టటం ఇతని అభిరుచిగా కనిపిస్తోంది.

ఒక కవి నచ్చితే వారిని పైకెత్తటం, వారిని వారి కావ్యాలను ఇంద్రుడు, చంద్రుడు అని పొగడటం తరచు కనిపిస్తుంది. ఆ విమర్శకునికి మహాకవి అయితే అందరి దృష్టిలో మహాకవి కాకపోవచ్చు "ఋషిత్రయం-చలం-శ్రీశ్రీ-చింతా!" అని (రామకృష్ణ మిరియాల। ప్రభ, ఏప్రిల్ 3, 1983) "ముగ్గురు మహాకవులు : గురజాడ, శ్రీశ్రీ కృష్ణశాస్త్రి" (రామకృష్ణ-మిరియాల జ్యోతి । 7 డిసెం । 1980) అని తనకు నచ్చిన వారిని పొగడటం కనిపిస్తుంది. ఈ విధమైన పొగడ్తల వలన అభిమానాభిరుచి వ్యక్తీకరించబడుతోంది.

(4) భావ వైరుధ్యం -

ఒక విషయంపై భిన్న అభిప్రాయాలతో ద్వంద్వ వైఖరిని అవలం భించటం విషయాన్ని సమర్థిస్తున్నట్లుగా కనిపిస్తున్నా విమర్శించే వైఖరిని భావ వైరుధ్యంగా పేర్కొనవచ్చు. శబ్దానికున్న రూపాన్నిబట్టి భావాన్ని వ్యంజకత్వాన్ని భావించటాన్ని "Iconcity" అనే భాషా శాస్త్ర లక్షణం ద్వారా నిరూపించవచ్చునని, దీన్ని సారూప్య సంబంధం అని పేర్కొం టున్నారు.

(11) "ఒక వస్తువును, సంఘటనలోను ఉన్న సారూప్య సంబంధాన్ని భాషా రచనలో (లేక ఉందని ఊహిస్తున్నాం) దీనికి ఋజువులుండవు. దీనికి శాస్త్ర ప్రమాణం లేదు. ఈరకమైన విమర్శ చేసేవారు స్పష్టంగా పోలికలు చూపిస్తే పాఠకులు ఆమోదిస్తారు."

అని ఈ విధానంపై ఒక నిశ్చితాభిప్రాయాన్ని ప్రకటిస్తూ వర్ణాకృతి వలన వర్ణ్య వస్తువు వ్యంజింపబడటం అంగీకరించటం లేదు.

(12) "ఇంతకీ నేనడిగేది ఒక్కో అక్షరం ఒక్కో భావాన్ని వ్యంజించటం గురించి (అసలు వ్యంజన అనేది లేదని కాదు) ఉదాహరణకి "ఏళ్లుముదిరి కీళ్లుకదలి, బ్రతుకంటే కోర్కె నడలి" అనే శ్రీశ్రీ గేయంలో ఇకారాంతత్వానికి ముసలితనానికి సంబంధం ఎట్లా కల్పించగలరు".

ఒకే వ్యక్తి రెండు అభిప్రాయాల్ని వ్యక్తీకరించటంలో భావ వైరుధ్యం కనిపిస్తోంది.

5. స్వీయ కవిత్వ సమర్థనం -

నేటి విమర్శలో రెండు రకాల విమర్శకులు ఉన్నారు. కవి-విమర్శకులు, కేవల విమర్శకులు. కవి విమర్శకులు తాము వ్రాసే కవిత్వాన్ని సమర్థించుకోవటానికో, తన కవితా దృక్పథాన్ని వివరించుకోవటానికో విమర్శ వ్రాస్తున్నారు.

(13) "రాను రాను మన కవులు వైయక్తిక అనుభవానికి
దూరం అయిపోతున్నారు. వారి మనః ప్రపంచం కూడా
గుప్పెడు సినాదాల పరిధికి కుంచించుకుపోయి ఆమేరలోనే
గానుగెద్దుల్లా గుండ్రంగా తిరుగుతున్నారు."

అను ఇస్మాయిల్ తాను అనుభూతి కవిత్వం వ్రాస్తాడు. కనుక కవిత్వం అనుభూతికి దూరం అవుతోందని తన కవిత్వ తత్వాన్ని సమర్థించుకోవటం కనిపిస్తోంది.

6. వ్యక్తిగత బలహీనతలు—

విమర్శకుడు తన దృక్పథానికి వ్యతిరేకమైందిగాని, నచ్చిందిగాని చెప్పాల్సినప్పుడు వస్తు తత్వాన్ని వదలి సంయమనాన్ని కోల్పోయి మాట్లాడటాన్ని వారి బలహీనతగా గుర్తించవచ్చు.

(4) "అనుభూతివాదం అనేది ఒక నాన్సెన్సికల్ టరమ్.
ఇది కవిత్వంలో ఒక వాదం ఎప్పుడూ కానేరదు.
అనుభూతి లేకుండా కవిత్వం ఎప్పుడు లేదు.
అయితే ఈ అనుభూతి వ్యక్తికి పరిమితమా ?
వ్యక్తులకు పరిమితామా ? అనేవే ప్రశ్నలు".

ఇక్కడ ఒక పుస్తకాన్ని సమీక్ష చేస్తూ తన అభిప్రాయాన్ని వ్యక్తీకరించటంలో సంయమనం లేక నాన్సెన్సికల్ టరమ్‌గా చీదరించుకోవటం కనిపిస్తోంది.

వ్యక్తిగత అభిరుచిని ప్రకటించేటప్పుడు మధ్యలో రవ్వలలాంటి అభిప్రాయాలను చెప్పటం కనిపిస్తుంది. వాటికి సాహిత్యపు విలువ ఒక్కొక్కసారి లేకుండా పోతుంది. మినీ కవిత గురించి—

(15) "అత్యంత మినీ కవిత "ఓం" ఇది ఏకాక్షర బ్రహ్మ విద్య" ఈ విధంగా అనటం ఆ ప్రక్రియ రూపం అత్యంత చిన్నది అనే దృష్టితోనే కాని అది మిని కవిత అంటే ఎవ్వరూ ఒప్పుకోకపోవచ్చు.

నేడు ఏ ప్రక్రియనైనా సామాన్యుడు సైతం అర్థం చేసుకోవాలనే దృష్టితో ఆలంకారిక శాస్త్ర చట్రాలనుండి విమర్శ విడివడి స్వేచ్ఛగా సాగుతోంది. ఈ స్వేచ్ఛలో మౌలికమైన శాస్త్రీయతా దృష్టి వదలి వ్యక్తిగత అభిరుచుల ఆధిక్యత ఏర్పడుతోంది. వ్యక్తిగత అభిరుచిలోని అభిప్రాయాలు ఆకర్షణీయంగా ఉండి చదివింపచేసుంటాయి ఒక్కొక్కసారి విమర్శకుడు ఒక విధానాన్నిఅనుసరిస్తున్నా తన వ్యక్తిత్వాన్ని వ్యక్తీకరించుకోవాలని కీర్తిని సంపాదించాలనే వైఖరి ప్రకటించబడి శాస్త్రీయతకు దూరం అవుతున్నట్లు కనిపిస్తోంది. విమర్శకులు వస్తువును వీడి తమ వైయక్తిక అభిరుచితో విమర్శచేస్తూ అభిరుచి విమర్శను వెలయిస్తున్నారు.

## II ప్రయోగాత్మక అభిరుచి

సాహిత్య విమర్శలో క్రొత్తదనాన్ని తేవాలనే దృష్టితోను, కావ్యాలను విమర్శించటంలో కావ్యతత్వాన్ని అలంబనంగా చెప్పాలనే దృష్టితో విమర్శలో తాను ప్రతిపాదించే అభిప్రాయాలు స్వీయమైనవని ప్రకటించే వైఖరిలోను, ప్రయోగాన్ని నిర్వహిస్తూ ఆ ప్రయోగానికి తగిన సాపేక్ష లక్షణాలను నిర్మించుకొని దీనికి తగినట్లు సమన్వయాత్మకంగా అభిరుచిని వెల్లడించటం ప్రయోగాత్మక అభిరుచిగా గుర్తించవచ్చు. ప్రయోగం ప్రయోగం కోసమే కాక కవితా తత్వాన్ని వ్యంజించేది ప్రయోగం. రచయిత ప్రతిభను తెలుపుతూ క్రొత్త ప్రమాణాలను సృష్టిస్తుంది. విలువ

ప్రయోగానికి ప్రాణం. మారుతున్న సాహిత్యంతో విలువలుకూడా మారుతున్నాయి. వస్తువు నాశ్రయించి విమర్శకుడు దీనికి తగిన విలువలతో నిర్మించటం ప్రయోగాత్మక అభిరుచి. కవిత్వంలోకవులు ప్రయోగాలు నిర్వహిస్తుంటారు. ఆ ప్రయోగానుశీలనంకోసం విమర్శకుడు క్రొత్త మార్గాన్ని అన్వేషింపవలసివస్తుంది. అప్పుడు చేసే విమర్శకూడా ప్రయోగాత్మక విమర్శే.

నేడు విమర్శనా రంగంలో అభిరుచి ప్రయోగాత్మకంగా వ్యక్తీకరించబడుతూ శాస్త్రీయతను పొందటానికి ప్రయత్నిస్తోంది. కొత్త ప్రయోగం చేస్తున్నాడంటే విమర్శకుడు తన అభిరుచితో క్రొత్తమార్గాన్ని నిర్మిస్తున్నాడన్నమాట. ప్రయోగానికి అభిరుచి బీజం. ఉత్తమ ప్రయోగం. ఉత్తమ సిద్ధాంతంగా రూపొందవచ్చు. ఉత్తమ సిద్ధాంతం ఉత్తమ ప్రయోగాత్మక అభిరుచికి తార్కాణం. అందుకే మన సిద్ధాంతాలు అభిరుచి ప్రధానాలు అంటున్నారు.

(16) "ఇప్పటి వరకు మనం చేసిన పనిని గురించి సాహిత్యం
అంటే మనకున్న దృక్పథాన్ని గురించి, మన సాహిత్య
సిద్ధాంతాల గురించి ఒక్క మాటలో చెప్పాలంటే
అవి అభిరుచి ప్రధానాలనవచ్చు"

సాహిత్య ప్రయోగాలన్నీ కూడా అభిరుచి ప్రధానాలే. నేటి ప్రయోగాత్మక అభిరుచి వస్తువును వీడకుండా నిర్వహించబడటం వలన కేవలం భావవాదంగా కాక వస్త్వాశ్రమ భావవాదంగా నిలుస్తోంది.

1. కావ్యలక్షణ ప్రతిపాదనాత్మకత.

ప్రతి కావ్యానికి దానికి తగిన సాపేక్ష ప్రమాణాలు కవి చెప్పేవి విమర్శకుడు ఏర్పరచేవి అని రెండు రకాలు. విమర్శకుడు ఒక ప్రత్యేక కావ్యానికి లక్షణాలు చెప్పేటప్పుడు కావ్య అంతర, బహిర లక్షణాల వివేచ

సగా సాగుతుంది. అవి ఆ కావ్యానికి మాత్రమే పరిమితం. ఒక కాలంలో వచ్చిన కావ్య సంచయాన్ని గ్రహించి మహాకావ్య లక్షణాలు చెప్పటం నేటి విమర్శలో కనిపిస్తుంది. ఇక కవితా దర్శనాన్నిబట్టి నేటి కవిత్వానికి ఫలానా లక్షణం ఉండాలని ప్రతిపాదించటం పరోక్షంగా కావ్య లక్షణాలను చెప్పినట్లే. అన్ని రకాల కవిత్వాలకి వర్తించే లక్షణాన్ని ప్రకటించటం కూడా నేడు కనిపిస్తోంది.

ఒక కావ్యాన్ని గురించిన అభిప్రాయాల్ని చెబుతూ కొన్ని సిద్ధాంతాల్ని చెప్పటం కనిపిస్తోంది. ఉదా॥ "కొయ్య గుర్రంపై-

(17) "దానిలో వాడిన ప్రతీకలు సామాన్య పాఠకులకు ముఖ్యంగా అన్యాయానికి బలి అవుతున్న దీనులకు అర్థం అయ్యే స్థాయిలో లేవు. ఈ కావ్యంలో కవి వాడిన సంకేతాలు క్లిష్టంగా మరీ సాంకేతికంగా ఉన్నాయి."

అని ప్రతీకల్ని గురించి అంటున్నారు. సామాన్యులకు అర్థం కావాలనే ప్రతిపాదన కూడా ఉంది. అయితే భావచిత్రాలతో, శబ్దచిత్రాలతో నిండిన నేటి కవిత్వం అస్పష్టతతో ఉందనే అభిప్రాయం విమర్శలో ఉంది. సామాన్యులకు అర్థం కావాలనే దృష్టితో నినాద ప్రాయమైన గీతాలు వ్రాస్తున్నారన్న విమర్శ లేకపోలేదు.

(18) "విప్లవ ప్రచారానికి పూనుకున్నవారు అట్టడుగున వున్న ప్రజలకు తేలికగా అర్థం కావాలని తేలికైన పదజాలంతో నినాద ప్రాయమైన గీతాలను రచిస్తున్నారు"

ఏమైనా కవిత్వంలో కవిత్వ లక్షణం ఉండాలి. ప్రతీకలు నేటి అభివ్యక్తికి వాహికలు. అవి వైయక్తికమైనవి కాకుండా పరిశీలకు వెంటనే వాటి తత్వం తెలిసే విధంగా ఉండాలి. కవి ఒక వర్గాన్ని ఉద్దేశించి కవిత్వం వ్రాయడు. అందరికి అర్థం అవటం అనే సామాన్య లక్షణం ఎప్పుడు

ఉంటుంది. కొన్ని సందర్భాల్లో అస్పష్టత వలన అర్థం కాకపోవచ్చు. కాని కొందరు.

(19) "కవిత్వం అర్థం కాలేదంటే సిగ్గుపడవలసినవాడు అర్థం కానివాడే కాని కవిత రాసినవాడు కాదు"- అని.

(20) "ఆధునిక కవిత్వం అర్థం కాలేదంటే ఇతనికి ఆధునిక జీవితమే అర్థం కాలేదన్నమాట"

అనే అభిప్రాయాలు వ్యక్తీకరిస్తున్నారు. నేడు విప్లవ కవిత్వంలో వంగపండు, గద్దర్ వంటి వారు ప్రజల భాషలో కవిత్వం చెబుతూ ప్రజా కవులనబడుతున్నారు.

ఇక సమకాలీన కవిత్వాన్ని వివేచిస్తూ కావ్యలక్షణాల్ని నిర్దేశించటం కూడా కనిపిస్తోంది. దీనిలో ఒక కావ్యాన్ని ఆధారం చేసుకొని మహాకావ్య లక్షణాలు చెప్పిన వాళ్లు, అనేక కావ్య సంచయాన్ని ఆధారం చేసుకొని చెప్పిన వాళ్ళు ఉన్నారు.

కొయ్య గుర్రం పీఠిక వ్రాస్తూ చేకూరి రామారావుగారు ప్రతిపాదించిన మహా కావ్య లక్షణం చాలామంది విమర్శకులకు అర్థం కాకుండా అంగీకార యోగ్యం కాకుండా ఉంది.

(21) "భావాలకి మూడ్స్‌కి తేడా నాకు తెలియడం లేదు. "అర్బేనిటి" అంటే పెద్ద మనిషి తరహా సౌజన్యం, నాగరక స్వభావం అని అర్థాలు. ఇవి కవిత్వ గుణాలు అయి ఇవి లేకపోతే మహా కావ్యానికి ప్రక్రియాపరంగానైనా వచ్చే లోటు ఏమిటో తెలియడం లేదు".

"చేరా నిర్వచనం ప్రకారం చూసినా ఈ కావ్యం
మహాకావ్యం కావడం లేదని అంటున్నానంతే''

ఇక్కడ అధునిక మహాకావ్య లక్షణాలను ప్రతిపాదించే ప్రయత్నం విఫలం అయినట్లు కనిపిస్తోంది అయితే-

(22) "ఒకటి అర లక్షణాల్లో లోపం ఉన్నా ఈ విభజన ప్రయోజన రహితం కాదు. నేను గుర్తించిన లక్షణాలు ఇంతకన్నా పటిష్టంగా చెప్పాల్సిన అవసరం ఉంటే ఉండొచ్చు."

అన్న రచయిత అభిప్రాయం కొంత సమన్వయ దృష్టితో నేడు కావ్య లక్షణాల్ని ప్రతిపాదించాల్సిన అవసరాన్ని తెలుపుతోంది

సమకాలీన సాహితీ చైతన్యాన్ని సమీక్షిస్తూ అధునిక మహాకావ్య లక్షణాలు ప్రతిపాదించిన వారిలో డా॥ జివి, సుబ్రహ్మణ్యంగారొకరు. పది రకాలైన సూత్రాలతో అధునిక మహాకావ్యం ఉండాలని-

(23) 1. "మానవ ప్రగతినిగాని, ప్రస్థానాన్నిగాని సాధ్యమైనంత వరకు ఒక సమన్వయంతోను, ఒక సమగ్రతతో సమీక్షించాలి.

2. వస్తువు వాచ్యం కాకుండా ప్రతీకాత్మక ప్రవృత్తితోను వ్యంగ్య గౌరవాన్నీ సాధించాలి.

3. అధునిక జీవితానికి ఒక అర్థాన్నిగాని ఒక సందేశాన్ని గాని అందించాలి.

4. కవిత ఇజాలను ప్రచారం చేస్తున్నట్లుగాక నిజాలను
నిత్య నూతనంగా వ్యక్తీకరిస్తున్నట్లుండాలి.

5. కవితాభివ్యక్తి అనుభూతి నందిస్తూ ఆలోచన రేకెత్తించాలి"

మొదలైన పది సూత్రాలను చెప్పారు. ఇవి ఏ ఒక్కకావ్యాన్ని దృష్టిలో పెట్టుకుని చెప్పినవి కాకపోవటంచే శాస్త్రీయతను, విశ్వజనినతను పొందుతున్నాయి. విమర్శకుని సృజనాత్మక అభిరుచి కావ్య లక్షణాల్ని ప్రతిపాదించటంలో వస్త్వాశ్రితమవటం వల్ల ఉత్తమంగా భాసిస్తోంది.

2. విశ్లేషణాత్మకత

కావ్యాల్ని కాని, ప్రక్రియల్ని కాని విశ్లేషించి తత్వ నిరూపణచేయటం నేటి ప్రయోగాత్మక అభిరుచిలో ఒక విధానంగా ఉంది. వ్యాసం పూర్తిగా ఒక స్వరూపాన్ని విశ్లేషించి దాని తత్వాన్ని ప్రకటించే విశ్లేషణాత్మక ప్రయోగాభిరుచి అవుతుంది.

(24) ఆధునిక సాహిత్య విమర్శలో విశ్లేషణ (Analysis) ప్రధానమైన పద్ధతి. ప్రతి వస్తువును విషయాన్ని అంగాలుగా విభజించి పరిశీలించి తరువాత అందులోని అంగాంగా సమ్మేళనాన్ని చూచి (Organic Unity) ఆనందించటం ఆధునిక శాస్త్రీయ దృష్టి. శాస్త్రానికున్న లక్షణాలు అలవరచుకోవాలని తపించి పోతున్న సాహిత్య విమర్శలో కూడా ఈ గుణం ప్రముఖంగా కనిపిస్తుంది."

విశ్లేషణ పూర్తిగా వస్తువును ఆశ్రయించుకొని ఉంటుంది. కనుక విమర్శకుని అభిరుచి ఉండనుకొంటాం. కాని విశ్లేషణచేయటం విమర్శకుని స్వీయ అభిరుచి మీదనే ఆధారపడి ఉంటుంది. విమర్శకుడు ప్రతిభకలవాడైతేనే అభిరుచి శాస్త్రీయతను పొందుతుంది.

ఆధునిక కవిత్వంలో అన్వయ క్లిష్టతను విశ్లేషిస్తూ పేర్వారం జగన్నాథంగారు శబ్దగత, వస్తుగత అభివ్యక్తులకు చెందిన అన్వయ క్లిష్టతను వివేచించారు. అందులో అభివ్యక్తిలో కనిపించే క్లిష్టతను-

(25) "అభివ్యక్తికి సంబంధించిన అన్వయ క్లిష్టతను ఐదు రకాలుగా విభజించవచ్చు

1. ఉక్తి వైచిత్రిలో గాంభీర్యం లోపించడం వలనను
2. భావ చిత్రాలకు పరస్పర అర్థసాంగత్యం లేకపోవటం వలనను
3. కావ్యార్థ స్ఫూర్తికి సహకరించని వాక్య సముదాయం వలనను
4. మార్మికతతో కూడిన తత్వ చింతన వలనను
5. అసమర్థములైన అలంకారిక ప్రయోగం వలనను"

అని విశ్లేషించటంలో వాస్తవ సత్యాన్ని పాఠకుని కవిని కూడా ఈ అంశాన్ని గమనించమన్నట్లు శాస్త్రీయంగా ఉన్నాయి.

ఇక కొందరు కవుల్ని విశ్లేషించటం, ప్రక్రియల్ని విశ్లేషించటం సాధారణంగా కనిపిస్తూ ఉంటుంది. కొన్ని విమర్శలే విశ్లేషణాత్మక ప్రయోగాభిరుచి స్థాయిని అందుకున్నాయి.

3. ఆత్మాశ్రయత

విమర్శలో నేను, నా వంటి రూపాలలో విమర్శకుడు ప్రకటితం అయ్యేటప్పుడు ఆత్మాశ్రయతను గుర్తించవచ్చు. ఒక విషయమై తన అభినివేశాన్ని వ్యక్తం చేయదలచుకొన్నప్పుడు వ్యక్తిగత దృక్కోణం నుండి విషయాన్ని పరిశీలించదలచినప్పుడు, క్రొత్త భావాలను ప్రతిపాదనలను ప్రవేశపెడుతూ సాహిత్యరంగంలో తన స్థానాన్ని పెంచుకోవాలను

కొన్నప్పుడు, ఆత్మాశ్రయత కనిపిస్తుంది. ఆత్మాశ్రయత వలన వస్తుగతంగా సాగే విమర్శ భావగతంగా సాగుతుంది. విమర్శకుడు పొందిన స్పందన అభివ్యక్తిలో సంయమనం లేకపోవటం వలన, అనాలోచితంగా తొందర పాటు నిర్ణయాలను చేసే టప్పుడు ఆత్మాశ్రయ ధోరణి సంద్యమౌతుంది. విమర్శలో ఆత్మాశ్రయత అవసరమే. కాని దాని ప్రభావం వస్తువును అతిక్రమించకుండా వ్యక్తీకరించబడాలి. ఈ ధోరణి విమర్శకుని ప్రవక్తృత్వాన్ని తెలుపుతూ నిర్ణయాలకు అంతిమత్వాన్ని నిరూపిస్తుంది.

(26) "మంచి వచన కవితలు కూర్చి స్థిరపడిన కొద్ది మంది ఆధునిక వచన కవులను నాకర్థమైనంతలో అంచనా కట్టే ప్రయత్నం చేస్తాను. ఈ అంచనాలు నా వ్యక్తిగతమైన అభిరుచికి సంబంధించినవి.

శ్రీశ్రీ-వచన కవిత కూడా కూర్చినా స్వభావతః ఛందకవి కొద్దిగా ఉన్నా ఈయన కవితలు ప్రామాణికాలు.

ఆరుద్ర-సూరుపాళ్ళ ఆధునికుడు-క్లిష్టత ఉన్నా తన పద్యాలకు తను అర్థం చెప్పగల సమర్థుడు.

శేషేంద్ర శర్మ చేతికి చిక్కకుండా మనస్సులకు చుట్టుకునే పొగమంచులాగా ఉంటుంది కవిత !!

ఇక్కడ విమర్శకుడు స్పష్టంగా నా అభిరుచికి సంబంధించిందని చెప్పటంలో ఆత్మాశ్రయత కనిపిస్తుంది తాత్వికమైన ఆత్మాశ్రయ ధోరణి కూడా కనిపిస్తోంది.

మార్క్సిస్ట్ విమర్శకులు ఆత్మాశ్రయతను ఒప్పుకోరు కాని ఆ విమర్శకులలో తాత్విక ధోరణిలో ఆత్మాశ్రయత కనిపిస్తోంది.

(27) "తెలుగు కవిత్వానికి పెద్దకాలం దాపురించింది. అభ్యుదయం పేరుతో కవిత్వంలో ప్రవేశించిన

రాజకీయాలు-ఏకుమేకైనట్లు-కవిత్వాన్ని హతమార్చి తామే
కవిత్వంగా ఊరేగుతున్నాయి...

ఇంతకు కవిత్వమంటే యేమిటి ? చదివినప్పుడు నీకు
హృదయం ద్రవిస్తే. కళ్లు చెమరిస్తే లేదా కడుపు మండితే
లేదా ఒళ్ళు పులకరిస్తే లేదా వెన్ను జలదరిస్తే అది
కవిత్వమని చాలా మందికి తెలుసు. కాని చాలా మందికి
తెలియనిదేమిటంటే ఉత్తమ కవిత్వానికి ఆవేశంబలం
కాదు. అనుభూతి సౌకుమార్యం. ఈ విషయం తెలియటమే
ఒక సంస్కార విశేషం. ఈ సంస్కారం ఉన్నవాళ్లే మంచి
కవిత్వం వ్రాస్తారు లేదా వ్రాయాలనే తపనకు లోనౌతారు.
ఈ సంస్కారం కలవాళ్లు ఎప్పుడూ విప్లవ కవిత్వం వ్రాయలేరు."

కవిత్వంలో రాజకీయాలను ప్రతిబింబించటం మార్క్సిస్ట్ విమర్శకులు అంగీకరించే విషయమే. అయితే ఇక్కడ విరుద్ధంగా అభ్యుదయ కవిత్వం పేరుతో రాజకీయాలు ప్రవేశించి కవితా తత్వాని. తక్కువచేశాయంటూ విమర్శ చేస్తున్నారు. "సంస్కారం" అనే పరిభాషయాన్ని ప్రవేశపెడుతూ "సంస్కారం" ఉన్నవారే ఉత్తమ కవిత్వం వ్రాయగలరనటం విమర్శకుని తాత్వికమైన ఆత్మాశ్రయ ధోరణి ప్రకటించబడుతోంది

4. వాదాల్లో అభిరుచి

''Ism'' అనే దానికి తెలుగులో వాదం ప్రయోగిస్తున్నారు. ఎన్నో ISm,s ఉన్నా తెలుగు సాహిత్య విమర్శలో వీటి ప్రభావం పరిమితంగానే కనపిస్తుంది. ప్రసిద్ధమైనవి కాల్పనిక వాదం (Romanticism) మార్క్సిస్ట్ వాదం (Marxism) నిర్మాణవాదం (Structurelim) రూపవాదం (Formalism) మొదలైనవి. వీటిలో మార్క్సవాదం, కాల్పనికవాదంబాగా ప్రచారం పొందుతున్నాయి. ఈ వాదాలు కవితా తత్వాన్ని భిన్నకోణాలతో

వ్యక్తీకరించటానికి విమర్శలో రూపొందాయి. Ism's లో సూత్రాలు ఉన్నా, విమర్శకుని సృజనాత్మక అభిరుచికి అడ్డుగోడలు కావు. అందుకే వాటిలో కూడా అభిరుచి ఉంటుంది.

(28) "వస్తు ప్రాధాన్యతలో వరాకాష్ఠ ఇజం. ఇజం అంటే కవి ఆలోచనా విధానం సమకాలీన సమాజం పట్ల అతని అవగాహన తీరు."

ఇక్కడ విమర్శకునికి ఒక ఆలోచన ఉంటుందని అంగీకరించినట్లుంది. సమాజాన్ని అవగాహన చేసుకున్నా అతని ఆలోచన వ్యక్తీకరణలో అభిరుచిని ప్రకటిస్తారు.

ఇజం అనే పదం సాహిత్యపరమైన ఆలోచనా విధానాలకు వర్తిస్తుంది. నేడు మార్క్సిస్ట్ విధానంలోని విమర్శనా సాహిత్యానికే "ఇజం" పదాన్ని వాడుతున్నారు. మార్క్సిస్ట్ విమర్శన ఆలోచన విధానాన్ని ఆధారం చేసుకొని విమర్శచేయటాన్ని ఇజంకుకట్టుబడి చేస్తున్నాడని, అందువలన సాహిత్య తత్వం వ్యక్తీకరించబడటం లేదనే అభిప్రాయం కనిపిస్తోంది. కాని సిద్ధాంతపరమైన విమర్శ చేస్తున్నా విమర్శకుని స్వీయానుభవం ఏదో ఒక రూపంలో వ్యక్తీకరించబడుతోంది.

"ఆధునిక సాహిత్యంలో విభిన్న ధోరణులు" అనే విమర్శ గ్రంథం మార్క్సిస్ట్ సిద్ధాంత నేపథ్యంలో వచ్చింది. ఇందులో సామాజిక ఆర్థిక సూత్రాలను సాహిత్యానికి అనువర్తింపజేసిన విధానం తెలుస్తోంది.

(29) "భావకవిత్వం వస్తుగత సంస్కృతిలోని మార్పులవల్ల కాకుండా సాంఘిక ఉత్పత్తి శక్తుల సంబంధాలలో వచ్చిన మార్పుల వల్ల కాకుండా సామాజిక పునాదిలోని ఆర్థిక రాజకీయ కారణాల వల్ల కాకుండా పైకట్టడంలోని

సంస్కృతి చైతన్యం (Consciousness) కారణాలవల్ల
రచయితల మానసిక జగత్తులో సంభవించిన ఆనంద
విషాద, సంయోగ, వియోగ. ప్రశాంత, సుందర వికార
(Ugly) భావతరంగాలు వాస్తవికతను ఢీకొన్నప్పుడు
దానివల్ల జనించిన భావచిత్ర సముచ్ఛయంగా మాత్రమే
కనిపిస్తుంది"

భావ కవిత్వం వస్తుగత సంస్కృతి మార్పువల్ల కాకుండా రచయిత మానసిక జగత్తు మౌలిక పునాదిగా ఊడి వచ్చిందని దానికి సామాజిక పునాది రాజకీయ కారణాలు లేవంటున్నారు. ఏ కవిత్వానికైనా ఏదో ఒక సామాజం యొక్క నేపథ్యమో ప్రేరణో ఉంటుందని కొందరంటున్నారు.

(30) "భావ కవిత్వమనేది కూడా ఆకాశం నుండి ఊడి పడదు.
ఫ్యూడల్ వ్యవస్థ నుండి బూర్జువా వ్యవస్థ ఏర్పడేక్రమంలో
బూర్జువా వ్యాపార స్వేచ్ఛను ప్రతీకాత్మకంగా
ప్రతిభింబించిన ఉద్యమమే భావకవిత్వం''

ఇక్కడ భావ కవిత్వానికి ఆవిర్భావానికి కూడా ఒక వ్యవస్థలోని

స్వేచ్ఛాతత్వం సామాజిక పునాదిగా కనిపిస్తుంది భావ కవిత్వ ఆవిర్భావం సాహిత్య పరిణామంలో ఒక దశ. ఈ దశ యొక్క సాహిత్య అస్థిత్వాన్ని గుర్తించక తమ అభిప్రాయాలను చెప్పటం కొందరిలో కనిపిస్తుంది."

(31) "పాశ్చాత్య రొమాంటిక్ కవుల్లో ధ్వనించిన పొలిటికల్
ఓవర్‌టోన్స్ రాజకీయ వాస్తవికతాగ్రహణ తెలుగు
కవుల్లో ప్రతిధ్వనించ లేదు. దీనివల్ల అప్పటికే
సమాజపరమైన కవితా వస్తువు అక్కడ సాధారణ
స్థితినుండి నిర్దిష్టమై భారత రాజకీయ వాస్తవికతా

సరిహద్దుల్ని ముట్టడించగల అవకాశం కోల్పోయింది.
భావ కవులు చాలా 'కాలదూరంలో' ప్రభావం చూపగల
బలమైన కవులు కావడం వల్ల భావ కవిత్వ ప్రభావం
స్తబ్దత ఏర్పడినప్పుడల్లా తలెత్తుతూనే ఉంది''

అని రాజకీయ వాస్తవికతను ప్రతిఫలించేదిగా ఉండాలని భావిస్తూ రాజకీయ స్తబ్దత ఏర్పడినప్పుడు భావ కవిత్వం వస్తుందనటంలో సాహిత్య పరిణామాన్ని గుర్తించటం లేదు, కాని భావ కవిత్వం ప్రాచీన కవిత్వం కన్నా భిన్న సంప్రదాయాల్ని కవితా రీతుల్ని ఎన్నో తెచ్చింది. వ్యక్తి స్వేచ్ఛతోపాటు స్వరూపాన్ని కూడా కొంత మార్చిందనే చెప్పవచ్చు.

(32) "ఒక మేరకు అంతకుముందున్న సాహిత్య పరిణామంలో
ప్రగతిశీలంగా ముందుకు వచ్చిందే భావకవిత్వం సమాజ
సాహిత్యంలో స్తబ్దత కనబడినప్పుడల్లా భావ కవిత్వం
తలెత్తుతుందనటం చరిత్రలో గడిచిపోయిన దశ మళ్ళీ
జన్మిస్తుందనటం.

స్తబ్దత నుండి భావ కవిత్వం రావటం పరిణామక్రమాన్ని మార్చటంగా గుర్తిస్తూ, దీని సాహిత్య పరిణామాన్ని గుర్తించటం కనిపిస్తోంది.

సాహిత్యాన్ని సామాజిక, ఆర్థిక, రాజకీయ నేపథ్యంలో గతితార్కిక పరిణామాన్ని గుర్తిస్తూ విమర్శ సాగాలని, మార్క్సిజం దృష్టితో విమర్శ చేస్తూ తమకు నచ్చనివాటిపైన కువ్యాఖ్యలు, తమకనుగుణమైన వాటిపై ఇష్టాన్ని ప్రకటించటం, వ్యక్తిగత అనుభూతిని వ్యక్తీకరించటం ఈ ఇజమ్స్‌లో అభిరుచిగా కనిపిస్తోంది.

ఇక నిర్మాణవాదంలో కవితా నిర్మాణవాదాన్ని ఆధారం చేసుకొని ఏ విధమైన భావం వ్యంజింపబడుతోంది, వస్తువు ఏ విధంగా ఆవిష్కరించ

బడింది అనే అనుశీలన జరుగుతోంది. ఇందులో నిర్మాణం మా మే విమర్శకు ఆలంబనం సూత్రంగా ఉంటూ విమర్శకుని భావ వ్యక్తీకర ణకు వాహికగాఉంది.

ఇటీవల మినీ కవితపై నిర్మాణపరమైన చర్చ జరిగింది. మినీ కవిత సంక్షిప్త లక్షణాలలోలేదా క్లుప్తతను ప్రధానంగా పేర్కొనటంలో నిర్మాణంపై ప్రత్యేక శ్రద్ధవహిస్తున్నట్లు తెలుస్తుంది.

(33) ''మాట పువ్వు మనను ముల్లు"
ఇందులో కవిత్వం కన్నా సమగ్రమైన సంక్షిప్తత
పాఠకుల్ని అలరిస్తోంది. ఈ నాలుగు మాటల్ని
ఏమాత్రం తగ్గించి చెప్పలేము. ఇంతేకాదు ఇందులోంచి
ఏ మాటను దాని పర్యాయ పదంతో రిప్లేస్ చేయకూడదు
పదాల ఎంపిక ఇందులో ఉంది. ఒకవేళ మారిస్తే
ఈ భావతీవ్రత పడిపోతుందన్న మాట."

ఈ విధంగా కవితా నిర్మాణానికి భావానికినిగల సంబంధాన్ని చర్చిస్తూ నిర్మాణ విమర్శ సాగుతోంది. ఇది నేటి విమర్శలో ఇప్పుడిప్పుడే రూపుదిద్దు కుంటున్న వాదం.

ఇజమ్స్‌లో బాగా ప్రచారంగా ఉంది ప్రతీకాత్మక వాదం. నేటి కవిత్వంలో ప్రతీకలు ప్రధాన వాహికలుగా కనిపిస్తున్నాయి. వీటిని వ్యాఖ్యానించటంలో విమర్శకుల అనుభవం, అభిరుచే ప్రధానం. ఇతర కారణాలు ప్రమాణాలుగా చూపటం ప్రతిపాదించే అంశానికి శాస్త్రీయతను సాధించటమే.

ప్రాచీన సాహిత్యంలోను ఆధునిక కవిత్వంలోను ప్రతీకలు ఉన్నట్లు నేడు గుర్తిస్తున్నారు. ఉదాహరణకు ప్రభావతీ ప్రద్యుమ్నంలో ప్రతీకాత్మక

ప్రవృత్తి ప్రబంధాలు ప్రతీకాత్మకలై ఉండాలని జి.వి. సుబ్రహ్మణ్యంగారు ప్రతిపాదించారు. శ్రీశ్రీలో ప్రతీకల్ని పేర్కొని విశ్లేషించారు. "అరుద్ర త్వమేవాహం ప్రతీక వైచిత్రి" (శంకరరెడ్డి. జి.-భారతి-జూలై-85 "నాదేశం నా ప్రజలు ప్రతీకాత్మకత" (పెన్నాశిరాకృ-భారతి-మే-85) వంటి వ్యాసాలు ప్రతీకాత్మక వాదాన్ని ప్రకటిస్తున్నాయి.

(34) భరతుని వంటి లాక్షణికులు నవ రసాలకు వివిధ వర్ణాలు చెబుతారు. అలాగే ఒక్కొక్క ఋతువుకు ఒక్కొక్క ప్రతీకను చెప్పవచ్చు. వసంతానికి కోకిల, గ్రీష్మానికి ఎండ, వర్షానికి నల్లమబ్బు, శరత్తుకు వెన్నెల హేమంతానికి మంచు, శిశిరానికి చలి సంకేతాలుగా చెప్ప వచ్చు''

ఇక్కడ జంతువులకు ప్రతీకల్ని సూచించారు. కోకిలను వర్ణిస్తే వసంత ఋతువని ముఖ్యంగా తెలుస్తోంది. ఈ విధంగా ప్రతీకల్ని సూచించటం, కవి చెప్పిన ప్రతీకల్ని వివరించటంలో విమర్శకులు స్వీయ అభిరుచిని ప్రకటిస్తున్నారు.

5. విమర్శలో కవిత్వాభిరుచి

కవులు విమర్శకులుగా విమర్శ చేస్తున్నప్పుడు వారిలో కవితావేశం వచ్చినప్పుడు విమర్శ కూడా కవిత్వంగా వ్రాయటం ఒక ప్రయోగంగా ఉంది. కొందరి శైలి కవితా శైలిని పోలి ఉండటం కూడా ఉంది.

ఉదాహరణకి కవిత్వానికి స్వేచ్ఛ కావాలని కొందరంటుంటే, దేని నుండి కావాలని కొందరు ప్రశ్నిస్తున్నారు. దానికి సమాధానంగా ఒక కవితా ఖండిక కనిపిస్తోంది.

(35) "వర్గ పోరాటాల డానొకిక్కోట్ల నుంచీ
సాహిత్య శాంకోపాంగాల నుంచీ
పాత చింతకాయ పచ్చళ్ళనుంచీ
మార్క్సిజం నింపుకున్న వాళ్ళ నుంచీ
మహాకవుల నుంచీ
డ్రిల్లు మాస్టర్లనుంచీ
తండ్రీ మాకు స్వేచ్ఛ ప్రసాదించు''

అని విమర్శను కవిత్వంగా వ్రాశారు. ఇందులో కవితావేశం ప్రస్ఫుటంగా కనిపిస్తోంది. ఎదుటి వారు రెట్టించి అడిగినప్పుడు కవికి ఆవేశం వచ్చి విమర్శను కవిత్వంగా వ్రాశారు. ఇందులో చెప్పినవి విమర్శకునీ స్వీయాభిప్రాయాలుగా స్ఫుటంగా తెలుస్తున్నాయి. ఈ విధమైన అభిరుచిని కవిత్వాభిరుచిగా పేర్కొనవచ్చు.

6 తులనాత్మక అభిరుచి

భిన్న సాహిత్యాల మధ్య కాని, పాత్రల మధ్య కాని, కావ్యాలమధ్య కాని అంతర బాహ్య రూపాలలో భేదసాదృశ్యాలను నిరూపించే వైఖరిని తులనాత్మక అభిరుచిగా చెప్పవచ్చు. ఇందులో విమర్శకుని స్వీయ ఆలోచనా విధానమే ప్రాతిపదికగా ఉంటుంది. ఈ విధమైన అభిరుచి వల్ల సాహిత్యం విశ్వజనీనత్వాన్ని పొందుతూ ఒక భాషా ప్రభావం కాని పాత్ర ప్రభావం కాని ఇంకో భాషలో ఏ విధంగా ఉంది అని తెలుస్తుంది. నేటి విమర్శలో క్రొత్త వాహిక ఈ తులనాత్మక అభిరుచి.

భిన్న భాషలలో ఒకే తత్వంగల కవులను తులనాత్మకంగా పరిశీలించటం.

(36) "జాతి న పూఛో సాధుకి, పూఛిలీజియే జ్ఞానౌ
మోల్ కరో తల్వార్‌కి పడారహనేదో మ్యానే

వేషన కూడా ఇదే భావాన్ని వ్యక్తపరుస్తూ
కాషాయధారుల బండారమును బట్టబయలు చేసెను.
వేష భాషలింక కాషాయ వస్త్రముల
బొడి నెత్తులొప్ప లొరయు చంద్రు
తలలు బోడులైన తలంపులు బోకులా''

ఈ విధంగా ఇద్దరి కవుల మధ్య భావ సామ్యాలను చూపటం కనిపిస్తుంది.

ఇక రెండు సాహిత్యాలను తులనాత్మకంగా అధ్యయనం చేయటం ఒకదాని ప్రభావం మరో దానిపై ఏవిధంగా ఉంది అని నిరూపించే అభిరుచి ప్రచురంగా ఉంది. ఉదాహరణకు-

(37) "ప్రక్రియా పరంగా అన్వయించుకొని పరిశీలిస్తే హరిహర
రాఘవాంకుల రచనల ప్రభావం సోమనాథుని బసవ
పురాణం మీద కంటే పండితారాధ్య చరిత్ర మీద
ప్రబలంగా ఉన్నట్లు స్పష్టమౌతోంది"

అని కన్నడ సాహిత్యంలో ప్రసిద్ధమైన ప్రక్రియల రచనల ప్రభావం శివకవుల సాహిత్యంపై ఏవిధంగా ఉన్నది వివేచించటం కనిపిస్తుంది. ఈ విధంగానే పంపయుగం మీద నన్నయ తిరుగుబాటు "మఱ్ఱిచెట్లా మామిడంట్లా'', భక్తిగీతి వాదనీతి'' (సుబ్రహ్మణ్యం జి. వి.-సాహిత్య చరిత్రలో చర్చనియాంశాలు ఆం.ప్రభ-మే22 జూన్ 5-12-88) వంటి వ్యాసాల్లో కన్నడ తెలుగు సాహిత్యాల తులనాత్మక విమర్శ ప్రచురంగా కనబడుతోంది.

సాహిత్య విమర్శలో ప్రయోగాత్మక అభిరుచి క్రొత్తలక్షణాల్ని ప్రతిపాదించటం, విమర్శకుని స్థానాన్ని ప్రస్ఫుటీకరించటం, విశ్లేషణ ద్వారా కవితానుశీలనం చేయటం, తులనాత్మక అధ్యయన ప్రవృత్తిని

ప్రకటిస్తూ ప్రయోగాత్మక అభిరుచి విమర్శ నవ్య మార్గాన్ని నిర్మిస్తోంది. ప్రయోక్తకు శాస్త్రీయదృష్టి లోపిస్తే ప్రయోగం కేవలం ప్రయోగంగా ఉంటుంది. ప్రయోగం ప్రయోజనంతో కూడి రాబోవు తరాలకు, సమకాలీనులకు మార్గదర్శకమైతే అది ఉత్తమ ప్రయోగాత్మక అభిరుచి.

## III అభిరుచి విమర్శ - ప్రామాణిక అభిరుచి

ఒక్కొక్క యుగంలో ఒక్కొక్క సాహిత్య సిద్ధాంతం ప్రమాణంగా ఉంటుంది. సాహిత్య విమర్శలో శాస్త్ర, కళా ప్రమాణాలు రెండు కూడా విమర్శకుని దర్శనం నుండి ఏర్పడినవే. అందుచే ప్రామాణికత అనేది శాస్త్ర, కళా ప్రమాణాలలో దేనినైనా అనుసరించవచ్చు. ఒక్కొక్క కాలంలో ఒక్కొక్క దృక్పథం ఎక్కువగా అనుసరించబడుతుంది. తాను శాస్త్రీయంగా చెబుతున్నట్లు భావించి తనదే ప్రమాణం అయినట్లు నిశ్చితాభిప్రాయంతో చెప్పటం వ్యక్తిగత ప్రమాణ అభిరుచిగా చెప్పవచ్చు. ఉదాహరణకు -

(38) ''తెలుగులో మహాభారత రచన జరిగిందే ఒక బాధ్యత
నిర్వహించడానికి అది ఆనాటి ధర్మమైన వైదిక మతోద్ధరణ,
అలాగే కావ్యాల్లో కవులు కాంక్షించినది సకల పురుషార్థ
దాయకంబైసదాన్ని ఈ పురుషార్థాలనే వాటిని గురించి
అవి సాధించే సావకాశాలు గురించి మన దేశంలో
కాషాయగుడ్డ కట్టిన ప్రతివాడు చెప్పగలడు''

ఇక్కడ భారత రచన కేవలం ఒక మత కావ్యంగా చిత్రించబడింది. కాషాయ వస్త్రదారులు పురుషార్థాలను గురించి చెప్పగలరేమో కానిసాహిత్య మర్మాలను చెప్పలేరు. కావ్యాలు దేవాలయాల్లో చెప్పుకునే పురాణాలుగా భావించినట్లుంది. "సాహిత్య సిద్ధాంతం" అనే వ్యాసంలో ఈ విధంగా

చెప్పటం తాను చెప్పేది ప్రమాణం అని భావించుకొన్నట్లుంది. ఈ విధమైన వ్యక్తిగత ప్రమాణం సాహిత్య విలువల్ని దెబ్బతీయవచ్చు.

అభిరుచి విమర్శ సాహిత్య తత్వాన్ని వస్తు తత్వాన్ని ఆశ్రయించి విమర్శకుని వ్యక్తిత్వాన్ని తెల్పేదిగాను, విమర్శకుడు ప్రతిపాదించే అంశాలు శాస్త్రీయమైనవిగాను లేదా శాస్త్రప్రమాణాలకు దగ్గరగాను ఉండి ప్రమాణికత్వాన్ని పొందుతోంది. ఆలంకారిక సూత్రాలను ఆధునిక కావ్యాల్లో సమర్థవంతంగా వర్తింపచేసి కావ్య తత్వాన్ని నిరూపించటంలోను ప్రక్రియలకు నూత్న లక్షణాలను రూపొందించటంలోను శాస్త్రీయత భాసిస్తోంది. ఏమైనా అభిరుచి విమర్శకుని అనుభవ సాంద్రతను తెలుపుతూ, సమకాలంలోను, ఆగామి విమర్శకులతోను సమంజసమైనదే అని భావించేటట్లుగా వ్యక్తీకరించబడిన అభిప్రాయాలు ప్రామాణిక అభిరుచి విమర్శ అని పేర్కొనవచ్చు.

## 1. ఆధునిక కావ్యాల్లో ఆలంకారిక మార్గం

ఆధునిక కాలంలో కావ్యాల్లో వస్తువు మారినా, అనుశీలన సూత్రాలు మారినా కొన్ని ఆలంకారిక సూత్రాలు వర్తిస్తున్నాయి. అయితే కొందరు ఇంకా పాత ప్రమాణాలతో కవితానుశీలనం చేస్తున్నామనే అభిప్రాయంతో ఉన్నారు. ఇందులో కొంత నిజం లేకపోలేదు. కాని ఆలంకారికసూత్రాల్లో ఆయా కాలాలకు పరిమితమయ్యే సాపేక్ష సూత్రాలు, సార్వకాలికాలైన శాశ్వత సూత్రాలు కూడా ఉన్నాయి. కవి దృక్పథానికి భిన్నంగా ఆలంకారిక సూత్రాలను వర్తింపచేయటం అతివాదమే అవుతుంది. ఆధునిక కాలంలో ఆలంకారిక ప్రమాణాలను అనుసరిస్తూ, దీని ఆవశ్యకత ఎంతవరకు అవసరమో గుర్తిస్తూ కావ్యాలు రచించటం, విమర్శించటం జరుగుతోంది.

ఆధునిక కావ్యాల్లో ఆలంకారిక ప్రాముఖ్యతను వివరిస్తూ-

(39) "ఆలంకారికత లేకుండా ఒక కవి తన అనుభూతిని వ్యక్తం చేయలేడా అంటే చెప్పాలి. నిశితంగా పాఠకునికి

అనుభూతి అందదనే చెప్పాలి. అలంకారికత లేకపోతే
అది కవిత్వం కాకపోవచ్చు".

అని అనటంలో అలంకారికత ఏకాలంలోని కవిత్వానికైనా మౌలిక ధర్మంగా భావించవచ్చు. ఒక్క అలంకారికతే కాక ధ్వని, రస సిద్ధాంతాల సమన్వయం కూడా నేడు కనిపిస్తోంది,

భావ కవిత్వంలో భావాన్ని తప్పితే రసం గురించి అన్వేషించిన వారు అరుదు. భావకవిత్వంలో కూడా రసతత్వం ఉందని ఎంకిపాటల్లో సమగ్రమైన శృంగారరసావిష్కరణ చేయటం కనిపిస్తోంది.

(40) "ఇప్పుడున్న పాటల క్రమాన్నిబట్టి పరిశీలిస్తే ఎంకి
పాటల్లోని భావ పరిణామం గాని అవగతం కావు...
ఎంకి పాటల్లో అంగి రసమైన శృంగారం విభిన్న
ప్రస్థానాలను అధిగమించిన వైఖరి పరిశీలించాలంటే
ఈ పాటల వెనుక ఉన్న కావ్య తత్వాన్ని ఒక అనుస్యూత
తత్వాన్ని గవేషింపవలసి ఉంటుంది. ఆ దృష్టితో
ఈ పాటలను పునః పరిశీలించగా వీటిలో నాకు
స్ఫురించిన ప్రణయదశలు నాలుగు 1. ప్రణయప్రస్థానం
2. దాంపత్యయోగం 3. విప్రయోగం 4. "పూర్ణయోగం

అని ఎంకి పాటల్లోని కావ్య తత్వ నిరూపణకు, శృంగార రస నిరూపణకు పాటల క్రమాన్ని మార్చి అన్ని శృంగార దశల్ని గుర్తించారు. ఆ దశల కనుగుణంగా భావ పరిణామాన్ని రసయనాన్ని నిరూపించారు. ఎంకి పాటల్లో తత్వ నిరూపణకు ఆలంబమైనది అలంకారిక రస సిద్ధాంతమే. అలంకారిక విమర్శలో కవిత్వ శాశ్వత సూత్రాలు నేటి కావ్యాల్లో అంతర్లీనంగా ఉన్నాయి. వీటి నిరూపణ ఆధునిక కావ్యాల్లో అలంకారిక మార్గంగా

మార్గంగా పేర్కొనవచ్చు. ఇందులో సమర్థవంతమైన సూత్రానుశీలనే ప్రామాణికత. ఆధునిక కావ్యాలను ఆలంకారిక సూత్రాలతో విమర్శచేస్తూ విమర్శకులు తమ అనుభవాన్ని వ్యక్తీకరించటమే ఇందులో అభిరుచి. విమర్శకుడు తన ప్రయత్నంలో సఫలం అయితే ప్రామాణిక అభిరుచిగా గుర్తించబడుతుంది.

2. ప్రక్రియా లక్షణ ప్రతిపాదనాత్మకత.

ప్రక్రియలకు లక్షణాలు ఏర్పరచేటప్పుడు సహజంగా అవి వస్తుదృష్టి కలిగినవే అయి ఉంటాయి. అయితే కొందరి విమర్శల్లో భేదాభిప్రాయాలు రావటానికి వారి అభిరుచి కారణంగా కనిపిస్తోంది. ఆధునిక కవిత్వ ప్రక్రియలకు కొత్త లక్షణాలను రూపొందించటంలో విమర్శకుల అభిరుచి స్పష్టంగా ప్రకటితమౌతోంది. కొందరి అభిరుచి వైయక్తికంగాను. కొందరి అభిరుచి శాస్త్రీయంగాను ఉండి ప్రక్రియా లక్షణాలు రూపొందుతున్నాయి.

ఆధునిక కవిత్వం ప్రాచీన సాహిత్య ఛందో లక్షణాల్ని ఛేదిస్తూ స్వేచ్ఛాయుతంగా ఆవిర్భవించింది. మొదట గుణ ఛందస్సు నుండి మాత్రా ఛందంగా, మాత్రా ఛందస్సు నుండి అనియత ఛందంగా వ్యక్తీకరించబడు తుంది. అయితే కొందరు వచన కవితకు లక్షణాలు చెప్తున్నారు. కొందరు వచన కవితకు లక్షణాలా ? అని తిరస్కరిస్తున్నారు.

(41) "ఛందో బంధో బన్ధులను వ్యాకరణపు సంకెళ్ళను తెంపి
వేసిన ఆధునిక కవితా ప్రక్రియ ఈ వచన కవిత్వం
ఎలాంటి లక్షణాలకు లోబడక విలక్షణంగా స్వేచ్ఛగా
సాగుతూ ఉన్న వచన కవితకు కొందరు విమర్శకులు
ఏవో లక్షణాలు ఆపాదించి దానికి మళ్ళీ చట్రం బిగించ
బూనడం అనవసరం అసందర్భం హాస్యాస్పదం"

ఈ అభిప్రాయంలో వచన కవితకు లక్షణాలు చెప్పినంత మాత్రాన దాని స్వేచ్ఛకు భంగం కలుగుతుందని భావిస్తున్నట్లు తెలుస్తోంది. కాని ప్రచారంలో ఉన్న ప్రక్రియకు లక్షణాలు ప్రామాణికత్వాన్ని సంతరింప జేస్తాయి. అందుకనే వచన కవితకు వస్తు నిర్మాణాదుల పరంగా లక్షణాలు చెప్తున్నారు.

(42) "వచన కవిత్వానికి ముఖ్యమైన లక్షణాలుగా గమన వైవిధ్యం, నిరాడంబరత, గణ అనియతత్వం, పాద విభజన, అర్థపుష్టి, భావానుగుణమైన శబ్ద వైచిత్రి, లయ, అంతర్లయ, ఊపు, తూగు, విసురు, నియమ రాహిత్యం, అంత్యప్రాస యమకం, అనవసరాలంకార భార రాహిత్యం, వర్ణాధిక్యతకు స్వస్తి చెప్పటం వ్యావహారిక శైలి అనేవి కన్పిస్తున్నాయి"

ఈ విధంగా వచన కవిత్వానికి కొన్ని లక్షణాలు కనిపిస్తున్నాయి అయితే ఈ లక్షణాలు పూర్తిగా సాపేక్షమైనవి. ఏ రచన కారచనకు విశ్లేషించుకోవలసినవి. వచన పద్య లక్షణాలను చర్చిస్తూ చే. రా. సంపత్కుమారల మధ్య జరిగిన సంవాదంలో అభిరుచి పరమైన అభిప్రాయాలు ఉన్నాయి. విసురు, ఊపు, తూగు అనే లక్షణాలు చే. రా-

(43) "గోపాల చక్రవర్తి గారి కలం కలలకు పీఠిక రాస్తూ కుందుర్తి ఎప్పుడో 'విసురు' అనే లక్షణాన్ని ప్రతిపాదిస్తున్నానన్నారు. ఆయనే మరో సందర్భంలో "తూగు" అనేది వచన కవిత్వంలో కన్పిస్తుందన్నారు. 1961 కృష్ణా పత్రికలో అరిపిరాల విశ్వంగారు భావలయ సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. భావలయ అనగా పూసలలో దారం వలె నుండు అంతర్లయ అన్నారు. సి.నా రె గారు తమ

అచ్చయిన థీసిస్‌లో.... మాదిరాజు రంగారావు గారు తన కవిత్వం పుస్తకానికి వ్రాసుకున్న పీఠికలో తన కవితలో అంతర్లయ కాదు. అంతర్నాదం ఉందన్నారు. ఈ మాటలేవీ నాకర్థం కాలేదు."

అని వచన కవిత్వంలో విసురు, ఊపు, లయ లక్షణాలను ఖండిస్తున్నట్లుగా ఉంది. "నాకర్థం కాలేదు" అనటంలో కవిత్వంలోనే వాటికి అర్థం లేని వ్యర్థమైనవిగా భావిస్తున్నట్లుంది. కొందరు ఈ లయ, తూగు లేని కవిత్వాన్ని విమర్శించటం కూడా కనిపిస్తోంది.

(44) "ఆధునిక కవిత్వంలో వచ్చిన విచ్చలవిడితనం వల్ల ఈ మాత్రం లయ, తూగును కూడా బహిష్కరించిన శుద్ధ వచనంలోని భావుకత మాత్రమే కవిత్వంగా చెలామణి అవుతోంది".

ఇక్కడ లయ, తూగు అనేవి కవిత్వానికి మౌలిక లక్షణాలుగా భావిస్తూ అవి లేని కవిత్వాన్ని విచ్చలవిడితనంగా పేర్కొనబడుతోంది.

ఇక-తూగు, విసురు, వీటికి ప్రామాణికత్వాన్ని కల్పిస్తూ, వచన కవిత్వ నిర్మాణ పరంగా కొందరు పదగణాలను నిర్మిస్తున్నారు.

(45) సంప్రదాయ విధానంలో సమానమైన అక్షరాల వలన గాని, సమానమైన పదగణాల వలన గాని, సమానమైన మాత్రల వలన గాని పద్యాలలో లయ సిద్ధిస్తుంది. ఇలానే వచన పద్యంలో సమానమైన పదగణాల ద్వారా లయ సిద్ధిస్తుందని నేను ప్రతిపాదిస్తున్నాను"

వచన పద్యంలో లయ నిరూపణకు ఈ పదగణాలను ప్రతిపాదించినట్లుగా ఉంది. సంపత్కుమార భావ గణాల ప్రతిపాదన కూడా లయను

పటిష్ఠ్రోంది. ఈ లయను గురించిన ఈ ప్రతిపాదనలు అన్నీకూడా నూత్న లక్షణాలను ప్రకటించే అభిరుచి విమర్శే.

నేడు ప్రచారంలో ఉన్న మినీ కవితకు లక్షణాలు ఏర్పరచే వైఖరిలో విమర్శకుల వస్త్వాశ్రితమైన ప్రామాణిక అభిరుచి ప్రకటితమౌతోంది. ఒకరి కన్నా మరొకరు బలంగాచెప్తున్నామనే భావంతో చెప్పటం కూడా కనిపిస్తుంది. మిని కవితకు లక్షణాలు చాలామంది చెప్తున్నారు. వారిలో పేర్కొనదగిన వారు రావి రంగారావుగారు.

(46) నిజమైన మినీ కవితల్లో కనిపించే అతి ముఖ్యమైన లక్షణాలివి.

1. సంక్షిప్తత 2. వ్యక్తీకరణలో సూటిదనం
3. వ్యవహార వ్యావహారిక భాష 4. కొత్తదనం
5. భావ గాంభీర్యత".

పై లక్షణాలు మినీ కవితను అన్ని కోణాలనుండి దర్శించి చెప్పినవిగా కనిపిస్తున్నాయి.

మినీ కవితకు సామాజిక దృష్టి ఉంది. దానితో పాటు అహ్లాదక రంజకత్వాలను కల్గి అనందం, ఉపయోగం రెండుకూడా ఉన్నాయి మినీ కవితకు.

"సమకాలీన సమాజ చైతన్యాన్ని సమీక్షిస్తూ
(47) పద్య స్ఫూర్తిగా ఒక వెలుగులాంటి వివేచనను
జిగేలు మనేటట్లు తళుక్కుమనిపించి,
దాన్ని ఆలోచనామృతంగా వర్షించి, భావుకుల
హృదయాలను రంజింపజేసేటట్లు అభివ్యక్తీక
రించటం మినీ కవిత లక్షణం"

మహాకావ్యం ఒక వ్యూహం లాంటిది,

మిని క॰త ఒక బాణం లాంటిది"

మినీ కవిత సమాజాన్ని అధ్యయనంచేస్తూ భావుకులను ఆనందాబ్ధిలో ముంచే ప్రక్రియగాను, దాని శక్తిబాణంలాగా సూటిగా హృదయానికి చేరే దని, దాని ఆకృతికూడా బాణం అంత చిన్నదని తెలుస్తోంది. విమర్శకుని దర్శనం సమగ్రమైనదైతే లక్షణాలు ప్రామాణికంగా ఉంటాయి.

4. నిబద్ధతాత్మకత

ఆధునిక కాలంలో అభ్యుదయ విప్లవ కవిత్వాల వలన ప్రచారంలోకి వచ్చిన ప్రత్యయం, నిబద్ధత, కమిట్‌మెంటుకు సమానార్థకంగా ప్రయోగిస్తున్నారు. ఈ "నిబద్ధత" ఏవిధంగా, ఉండాలనే అంశంపై భిన్నమైన అభిప్రాయాలు వారి అభిరుచి మేరకు ప్రకటిస్తున్నారు.

1. సాహిత్యానికి సమాజంతో సంబంధం ఉండాలా? అక్కర లేదా?
2. కవికి సామాజిక బాధ్యత ఉందా?
3. కవిత్వం ఒక రాజకీయ పక్షానికి ప్రచారం చేయవచ్చునా?
4. విప్లవ కవిత్వం వ్రాయడానికి నిబద్ధత అవసరమా?

ఈ సమస్యలు నిబద్ధతా సిద్ధాంతంలో ప్రధానంగా కనిపిస్తున్నాయి.

నిబద్ధత వలన స్వేచ్ఛకు భంగం కల్గి అభివ్యక్తిలో లోపం ఏర్పడుతుందని కొందరు, ప్రతియుగంలోను సాహిత్యం ఏదో ఒక సిద్ధాంతానికి నిబద్ధమై ఉంటుందని కొందరు, సాహిత్యం సాహిత్యానికే నిబద్ధమై ఉండాలని కొందరు అభిప్రాయపడుతున్నారు.

(48) కవి తన కవితా వస్తువుతో ప్రజలలో
ఒక మార్పును ఆశించేవాడు కాబట్టి
ఏ మార్పును తాను ఆశిస్తాడో
ఆ మార్పును మాత్రమే అచంచలంగా చెప్పి
మార్పు తేవడానికి ఈ నిబద్ధతా సిద్ధాంతం
ఉపకరించింది. కవితా వస్తువు ఏదైనాసరే
చెప్పే విధానమూ, శిల్పమూ ముఖ్యమనీ శుద్ధకళా
వాదాన్ని మొదటిసారి ఖండించింది అభ్యుదయ
కవిత్వోద్యమం. అదే భావాన్ని మరోసారి
ప్రచారం చేసింది ఈ నిబద్ధతా సిద్ధాంతం

నిబద్ధతా దృష్టిలో వస్తువు, విధానం, శిల్పాలకన్నా తాను తేదలచు కున్న మార్పే ముఖ్యంగా కనిపిస్తోంది. ఇందులో కళ్ళాధర్మంకనా కవిత్వానికి ప్రచార ధర్మమే ప్రధానంగా ఉంది.

విప్లవ వాద విమర్శకులలో ఈ నిబద్ధత సమాజానికి ఉపయోగపడే ధంగా ఉండాలనీ, విరసం ప్రచారంచేసినట్లు విప్లవ కవితా సృష్టికి నిబద్ధత ఏసరం లేదనే వారు ఉన్నారు.

(49) రచయితకు కమిట్‌మెంట్ అవసరమే
ఇందులో సందేహించాల్సిన పనిలేదు
ఇటీవలి కాలంలో ఈ మాటను అతివేలంగా
ప్రచారం చేసినవాళ్ళు దిగంబరులు, వి.ర.సం.
వాళ్ళను కావటం వల్ల సహజంగా సంశయాస్పదమైన
కొంత అపభ్రంశమైంది....
విశాల శ్రామిక వర్గంలో వర్గ చైతన్యము

భావ విప్లవము వంటి వాటికి దోహదం చేయడానికి
తాము సృష్టించే సాహిత్యం తోడ్పడాలని
సహజంగానే ఆకాంక్షించాలి. ఈ ఆకాంక్ష
తీవ్రతనే కమిట్‌మెంట్ అనుకుంటే ఎవరికీ
పేచీ ఉండదు"

ఉత్తమ వ్యవస్థ ఏర్పడటం కోసం శ్రామిక వర్గఅభ్యున్నతిని కాంక్షించే తీవ్రతనే కమిటుమెంటు అనటంలో విప్లవ కార్యాచరణలో నిబద్ధులై ఉండాల్సిన అవసరం లేదని భావించినట్లు తెలుస్తోంది. కాని కొందరిలో విప్లవ కవితా సృజనకు. నిబద్ధత తప్పనిసరి అనే అతివాద ధోరణికూడా కనబడుతోంది.

(50) యదార్థ విప్లవ కార్యాచరణకు సాహిత్యపరంగా
దోహదం చేస్తూ విప్లవోద్యమంలో తాను
సాంస్కృతిక సైనికుడినని అనుకుని దానికనుగుణమైన
రచనలు చేసే వాడే విప్లవ రచయిత. రచన
అతని విప్లవ కార్యాచరణ....
"విప్లవోద్యమానికి నిబద్ధత తప్పనిసరి''

ఇక్కడ నిబద్ధత తప్పనిసరిగా ఉండాలి అని, దానితో నిమగ్నతకూడా ఉండాలనటంలో అభిరుచి కన్పిస్తోంది. అయా సందర్భాలను తెలుసుకొని గొప్ప కావ్యాలను కూడా వ్రాయవచ్చును. అందుకే స్వానుభూతితో కాని, సహానుభూతితో కాని వ్రాయవచ్చునని కొందరంటున్నారు.

(51) విప్లవ కవిత్వం స్వానుభూతిచేత పుట్టవచ్చు
సహానుభూతి చేత పుట్టవచ్చు విప్లవ పోరాటంలో

కాని, విప్లవ పోరాట కార్యక్రమాలలో కాని పాల్గొంటు
విప్లవ కవిత్వం వ్రాయవచ్చు. లేక విప్లవ పోరాట
వార్తలు విని, దృశ్యాలు చూచి ప్రకంపితుడై వ్రాయవచ్చు"

విప్లవ కవిత్వమైనా అభ్యుదయ కవిత్వమైనా ప్రకంపితుడై వ్రాయవచ్చుననటానికి అనేక కావ్యాలు నిదర్శనాలుగా ఉన్నాయి. సోమసుందర "వజ్రాయుధం"లో తెలంగాణా పోరాట చిత్రణను ఉదాహరణగా పేర్కొనవచ్చును.

నిబద్ధతపై ఈ అభిప్రాయాలన్నీ విమర్శకుల స్వీయాభిరుచి మేరకు ఏర్పడినవే. సాహిత్యం సాహిత్యానికే నిబద్ధమవ్వాలనే వాదం సార్వకాలికమైందిగా కన్పిస్తుంది. సాహిత్యం అన్ని కాలాల ప్రయోజనాన్ని సాధిస్తూ సాహిత్యపు విలువలు కల్గినదిగా కావాలి. కాని కవిత్వంలో రాజకీయాల ప్రవేశం అనివార్యం అనే భావనకూడా కన్పిస్తోంది.

(51) మన తరంలోని సమస్యలన్నిటికి
రాజకీయ సమస్య ఒక్కటే మూలభూతమైన
రూపం, అందుచేత రాజకీయాలను
తప్పించుకోవడమంటే వాస్తవికతను
తప్పించుకోవడమే''

అని చెప్పటంలో తాము చెప్పింది ప్రామాణికమైందిగా భావిస్తూ, అంగీకరించని వారు పలాయన వాదులుగా చిత్రిస్తున్నట్లున్నది. స్వానుభూతిచేత, సహానుభూతిచేత కూడా విప్లవ కవిత్వం వ్రాయవచ్చునన్నదాంట్లో సమన్వయ ధోరణి కన్పిస్తున్నది. కొందరు నిబద్ధత తప్పనిసరి అనే అభిప్రాయం ఒక వర్గాన్ని దృష్టిలో పెట్టుకొని చెప్పినట్లున్నది. మొత్తంమీద నిబద్ధతాత్మక అభిరుచి వైయక్తిక, సమన్వయ ధోరణుల్లో సాగుతోంది.

నేను సాహిత్యంలో "అనుభూతి కవిత్వం" అనే కవితా ధోరణి ప్రచారంలో ఉంది. దీన్ని అనుశీలించే విమర్శను, కవిత్వంలో మౌలికంగా ఉండే సౌందర్య దృష్టిని అనుశీలించే విమర్శను అనుభూతివాద విమర్శగా పేర్కొనవచ్చును.

(52) "అనుభూతివాద లేదా హృదయవాద విమర్శ
భావకవులతో ప్రారంభమైంది. దీన్నే సౌందర్యవాద
విమర్శ అని కూడా అనవచ్చును"

ఈ అభిప్రాయంలో అనుభూతివాద విమర్శ భావ కవులకాలం నుండి ఉన్నట్లు చారిత్రక సత్యం కన్పిస్తోంది. అయితే కొందరు ఇదొక పద్ధతిగా కూడా అంగీకరించకపోవటంకూడా కన్పిస్తోంది.

(53) అనుభూతివాదం పేరుతో సాహిత్యం యొక్క
సామాజిక ప్రయోజనాన్ని కించపరచడానికి
కొందరు విమర్శకులు చూస్తున్నారు. అనుభూతి అనేది
ప్రత్యేకంగా ఒక సాహిత్య సిద్ధాంతం కానేరదు''

సాహిత్యంలో వస్తువుకు మాత్రమే ప్రాధాన్యాన్నిచ్చే విమర్శకులు హృదయవాదాన్ని అంగీకరించకపోవటం, కవి పొందిన అనుభూతినందించే అనుభూతివాద విమర్శలో విమర్శకుడే కేంద్రంగా నిలుస్తాడు. ఒక కవితను ముగ్గురు విమర్శకులు మూడు రకాలుగా భావించటాన్ని అనుభూతివాదంలో అభిరుచిగా గుర్తించవచ్చును. ఉదాహరణకు రావిరంగారావుగారి కవిత "గుడ్‌మార్నింగ్'' అనే దాన్ని ముగ్గురు విమర్శకులు మూడు రకాలుగా భావించారు.

(54) "కవితలో ప్రకృతి వర్ణన ఉంది. చీకటి
తరువాత వచ్చే ఉదయ వేళను గురించి
కవి చెప్పారు. చాలా అందమైన భావ కవిత్వం
ఇది. ఉదయ సూర్యుని నుండి వచ్చిన
అరుణకాంతులు సముద్రంమీద పడి ప్రతి
ఫలించిన సన్నివేశం సూర్యుడు సముద్రం
పరస్పరం నవ్వుకుంటూ "గూడ్‌మార్నింగ్"
చెప్పుకుంటున్నట్లిందులో వర్ణించబడింది.
తాంబూలంలోని ఆకు వక్క సున్నంలాగా
ఆకాశం, చీకటి, వెన్నెల సముద్రం నోటిలో
ప్రతిబింబ రూపంలో కలిసాయి. తాంబూలం
వల్ల కలిగిన అరుణిమగా సముద్రంలో
పడిన ఉదయకాంతి భావించబడింది"
"ఉదయం అభ్యుదయానికి గుర్తు ఆకులు
అంటే సుకుమార హృదయం కలవాళ్లు
వక్కలంటే ధైర్యంగల గట్టి గుండె కలవాళ్ళు
సున్నం అంటే అన్యాయాదుల్ని సహించలేని
ఉద్రిక్త మనస్తత్వం కలవాళ్లు ఈ మూడు
రకాల వాళ్లు సజ్జనులే. తాంబూలం
లోని ఆకు వక్క సున్నం లాగా
వీరంతా ఒక్కటిగా కలిసిననాడు
దేశంలో అభ్యుదయం సాధించబడుతుంది.

"సముద్రం ప్రజలకు గుర్తు. జన సముద్రం
అని సహజంగా అంటుంటాం. సూర్యుడు
విప్లవానికి గుర్తు. విప్లవం వల్ల జనం
హర్షించటం జరుగుతుంది. నోరు
ఎర్రబడాలంటే, ఆకులు వక్కలు తప్పవు.
అలాగే విప్లవం రావాలంటే రకరకాల
వ్యక్తులు తమ జీవితాలను త్యాగం చేయక తప్పదు"

ఇక్కడ ముగ్గురు విమర్శకులు మూడు రకాలైన అనుభూతిని పొందారు. మొదటివారు భావకవిత్వంలోని శృంగార భావుకత్వానికి పొందితే, రెండవవారు సమాజంలోని భిన్న వర్ణాలు కలిస్తేనే అభ్యుదయం వస్తుందని భావిస్తే, మూడవవారు విప్లవం రావాలంటే జీవితాలను త్యాగం చేయక తప్పదని భావించారు. ఈ అనుభూతి వ్యక్తీకరణలోని వైవిధ్యం విమర్శలకు అభిరుచి.

అనుభూతివాద విమర్శలో కవి పొందిన అనుభూతిని విమర్శకుడు తాను పొందిన అనుభూతిని వ్యక్తం చేయటమే ధ్యేయం. ఇది ప్రాచ్య పాశ్చాత్య దృక్పథాల మిశ్రమ రూపంగా కనిపిస్తోంది.

(55) పాశ్చాత్యుల కళ కళకోసమే, కవిత్వం అంటే
కవి అనుభూతిని పాఠకునికి అందించటం.
అందం, ఆనందం కవిత్వ పరమావధి అని ఈ
వాద సారాంశం. ఈ వాదం భారతీయ
సాంప్రదాయవాద, పాశ్చాత్య కాల్పనిక
సమ్మేళన విమర్శ అనవచ్చు"

అని పేర్కొనటంలో అనుభూతివాదానికి సామాజిక దర్శనం లేదనే భావం తెలుస్తోంది. కాని పై కవితకు ముగ్గురు విమర్శకులు వ్యాఖ్యానిం

చిన తీరులో సామాజిక స్పృహ ఉన్నట్లు గుర్తించటం అనుభూతివాద విమర్శలో కూడా అభ్యుదయాన్ని చెప్పటం సమాజ దర్శనమే.

ఇక అనుభూతి కవిత్వానికి భావ కవిత్వానికి మరో రూపంగా అభివర్ణించటం నేటి విమర్శలో ఉంది.

(56) "అనుభూతివాదం భావకవిత్వమనే పాత
క్రీమ్‌కి కొత్త లేబిల్ మాత్రమే''

భావకవిత్వం వ్యక్తి మానసిక చైతన్యానికి ప్రాధాన్యతనిచ్చి సమాజానికి అతీతంగా వ్రాయబడి ఉండవచ్చు. కాని అనుభూతివాదంలో సమకాలీన సమస్యలకు స్పందన పొందుతున్న గుణం కన్పిస్తోంది. భావకవిత్వ లక్షణాలు అనుభూతి కవిత్వంలో కొన్ని ఉండవచ్చు. కాని దీనికి కొత్త లేబుల్ అనటం జరిగిపోయిన కవితాదశ మళ్లీ వస్తోందనటం పరిణామ క్రమాన్ని తలక్రిందులుగా చూడటంగా ఉంటుంది.

(57) "సమాజంలో ఉన్న పరిస్థితిని ప్రతిబింబిస్తుంది
అభ్యుదయ కవిత్వం. మనం నిత్యం గమనించే
అసమానత్వం, దోపిడి, దౌర్జన్యం
అందులో కనిపిస్తుంది. ఈ కవిత్వం వాస్తవాన్ని
ఇమిటేట్ చేస్తుంది. సమకాలీన సమస్యలకు
మనసు పొందే స్పందన అనుభూతి కవిత్వం. ఒకటి
బాహ్యదృష్టి. రెండవది అంతర్గత దృష్టి. ఒకటి జనాన్ని
ఎడ్యుకేట్ చేస్తే, మరొకటి ఇమోషనల్‌గా
దగ్గరకు చేరుస్తుంది"

భావకవిత్వంలో సమాజంలోని సమస్యలకు కాక వ్యక్తిగతమానసిక స్పందన పొందుతూ తమ భావాలను వ్యక్తీకరించుకొన్నారు. కాని అనుభూతి వాదంలో మానవ చైతన్యానికి అవసరమయ్యే విధంగా సమస్యలకు స్పందన పొందుతూ కవిత్వం వెలయిస్తున్నట్లు ఇక్కడ తెలుస్తోంది. నేటి సమాజానికి అభ్యుదయ క ిత్వం ఎంత ఆవశ్యకమో, అనుభూతివాద కవిత్వం కూడా అంత అవసరం అని గుర్తించబడుతోంది. అయితే కొందరు

(58) "అనుభూతివాదం అనేది ఒక "నాన్సెన్సికల్
టరమ్" ఇది కవిత్వంలో ఒక వాదం
ఎప్పుడు కానేకాదు. అనుభూతి లేకుండా
ఎప్పుడు ఉండదు"

ఇక్కడ "అనుభూతి" కవిత్వంలో ఎప్పుడు ఉంటుందన్న కారణంచే ఇదొకవాదం కానేరదు అని అంటున్నారు. ఇంతకుపూర్వం వ్యక్తిగత అనుభూతుల్ని వర్ణిస్తే, నేడు సమాజ సమస్యలచే పొందిన అనుభూతికి ప్రాధాన్యం ఇస్తూ వ్రాయటంలో ప్రత్యేకత కనిపిస్తోంది. దాన్ని గుర్తించకుండా "నాన్సెన్సికల్-టరమ్ అనటంలో వైయక్తిక అభిప్రాయంగా కన్పిస్తోంది.

అనుభూతి కవిత్వ చారిత్రక దశను దాని క్రమ పరిణామాన్ని గుర్తిస్తున్నవారు కూడా ఉన్నారు.

(59) "తెలుగులో భావకవిత్వం తర్వాత వ్యక్తి
వాదాన్ని ప్రతిఫలించే ధోరణులుగా
అస్థిత్వ వాద, అనుతిభూవాద ధోరణులు
వచ్చాయి. అస్థిత్వవాద దోరణి పాశ్చాత్య
దేశాల నుండి దిగుమతి అయితే అనుభూతి

వాదం మధ్యతరగతి అసామాజికత నుంచి

అనాసక్తత నుంచి వచ్చింది"

-ఇక్కడ భావకవిత్వం తర్వాత-వచ్చిన వ్యక్తివాదంగా పేర్కొంటున్నా, చారిత్రక పరిణామాన్ని గుర్తిస్తూ ఒక వాదంగా చెప్పటం కనిపిస్తుంది. ఇదొకవాదం కాదని వాదించేవారి అభిప్రాయం ఖండించబడుతోంది. ఎవరేమనుకొన్నా అనుభూతి కవితా వాదం, అనుభూతి విమర్శ నేడు ప్రచారంలో ఉంది. ఈ అనుభూతివాద విమర్శలో విమర్శకులు తమకు నచ్చక అదొక వాదం కాదని కొందరు అసామాజిక ధోరణి అనటం వైయక్తికమైన అభిరుచిగా ఉంది. కవితలోని కవి అనుభూతిని ప్రకటిస్తూ అనుభూతి విమర్శలో అభిరుచిని ప్రామాణికంగా వ్యక్తీకరించటం, శాస్త్రీయతను సాధించటం కనిపిస్తోంది.

5. సమన్వయాత్మకత

విమర్శలో ఉన్న వాదాల మధ్య కాని సిద్ధాంతాల మధ్యకాని సమన్వయాత్మకతను చెప్పటం కనిపిస్తోంది. సమన్వయం వల్ల భిన్న వర్గాలకు, వాదాలకు అవగాహన ఏర్పడి సాహిత్య పరిధి విస్తృతమౌతుంది. ఆధునిక విమర్శన సూత్రాలను ప్రాచీన కావ్యాలకు అన్వయించటం వలన సాహిత్య విమర్శన పరిధి నేడు పెరుగుతోంది. నేడు విమర్శ ప్రాచ్య పాశ్చాత్య విమర్శన సూత్రాల సమన్వయంగా సాగుతోంది. సమన్వయాత్మక అభిరుచి వలన ఒక అర్థంతోనే రూఢి అయిన వాటికి వ్యాప్తిలభిస్తూ భిన్న కవిత్వ వాదాల మధ్య అభిప్రాయాల మధ్య సమన్వయం ఏర్పడుతోంది.

"సాహిత్యం అభ్యుదయ-కవితానంతరం వాదాలమయం అయిందనే అభిప్రాయం లేకపోలేదు. వివాదాలతో ఉన్న కవిత్వంలో కవిత్వ విలువలు ఉండటంలేదని, మరీ తేలికయిన పదజాలంతో చప్పగా ఉంటోందనే అభిప్రాయంవిమర్శకుల్లో ఉంది."

(60) "విప్లవ ప్రచారానికి పూనుకున్నవారు
అట్టడుగున వున్న ప్రజలకు తేలికగా
అర్థం కావాలని తేలికైన పదజాలంతో
నినాద ప్రాయమైన గీతాలు రచిస్తున్నారు."

ఇక్కడ విప్లవ ప్రచారానికి అన్న విషయం గమనించాలి. ఈ అభిప్రాయం ఒక వర్గాన్ని నిర్దేశిస్తూ చెప్పినట్లుగా ఉంది, అయితే ప్రజల్ని ఉత్తేజితుల్ని చేసే అభ్యుదయ కవిత్వంలో నినాదాలు ఉండక తప్పదు. ఈ అంశాన్ని గుర్తించి నినాదాంతోకూడా కవితావాదం ఉంటుందని కొందరు విమర్శకులు అంటున్నారు.

(61) "నిర్వచనాన్ని ఆత్మాభివ్యక్తికి అనువుగా
అధునిక కవులు వాడుకుంటున్నారు.
నినాదాన్ని ఆదర్శాభివ్యక్తికి ఉపకరణంగా
ఉపయోగించుకుంటున్నారు. నిలిచి చెప్పేది
నిర్వచనం పిలిచి చెప్పేది నినాదం"

ఈ సమన్వయం వల్ల నినాదాలు నేటి కవిత్వంలో ఆదర్శం అభివ్యక్తికి వాహికలుగా ఉన్నాయని, కవిత్వంలో అవి నేడు అనివార్యాలని తెలుస్తోంది. ఇక్కడ నినాదాలు కేవలం ప్రచార సాధనాలుగా భావించేవారికి, నినాదాలలోకూడా కవితాంశ ఉండవచ్చునసేవారికి సమన్వయం చెప్పబడింది.

## ముగింపు

### అభిరుచి విమర్శ ప్రస్థానం

సాహిత్య విమర్శలో అభిరుచి విమర్శన విధానం అనుస్యూతంగా ఉండే జీవన స్రవంతి. విమర్శకుడు సాహిత్యాన్ని మొదట అనుభవిస్తాడు. అనుభవ వ్యక్తీకరణకు అతని సహజమైన సృజనాత్మక వైఖరి తోడ్పడుతుంది. కావ్యం అందించిన అనుభవం విమర్శకుని సృజనాత్మక వైఖరి తోడ్పడుతుంది. కావ్యం అందించిన అనుభవం విమర్శకుని సృజనాత్మక వైఖరిచే ఏర్పడే అభిప్రాయాలు కలిసి ఒక సమగ్రమైన రూపంగా ఏర్పడి విమర్శగా రూపొందుతుంది. నవ్యతను చెప్పాలన్న, సమన్వయాన్ని చెప్పాలన్నా, సిద్ధాంతం చేయాలన్నా దానికి సృజనాత్మక వైఖరే కారణం. విమర్శకు సృజనాత్మకతే ఆయువు పట్టు. కవిత్వంలోని సౌందర్యానుభవాన్ని, కవితానుశీలన సూత్రాలను అందిస్తూ కవిత్వ సమగ్రస్వరూపాన్ని ప్రకటిస్తూ విమర్శకుడు తన సృజనాత్మకతను ప్రకటించే వైఖరే అభిరుచి విమర్శన విధానం.

(62) "ఒక కాలంలో ఒక అభిరుచి లోకాన్నిపాలిస్తే
మరో కాలంలో మరో అభిరుచి లోకంలో
ఆదరించబడవచ్చు. అభిరుచిలోని అభినవత్వాన్నే
అధునికత అంటారు. అభిరుచి ఆదర్శాలను
రూపొందిస్తుంది. దృక్పథాలను ధృవీకరిస్తుంది.
నవ్యతను వరిస్తుంది.

సాహిత్యంతోపాటు యుగ ధర్మాన్ని అనుసరిస్తూ విమర్శరూపం మారుతుంది. విమర్శకునిలో సృజనాత్మక గుణం లేకపోతే పూర్వప్రమాణాలనే అనుసరిస్తాడు. కొత్తదనాన్ని తెచ్చే సృజనాత్మక గుణమే అభిరుచి. ఈ అభిరుచి భేదమే అధునికతను నిర్ణయించటంలో ప్రాతిపదిక. ఈ కొత్త

దనం వస్తువుసు వీడకుండా అభివ్యక్తమైతేనే శాస్త్రీయతను పొందుతుంది. కొన్ని సందర్భాలలో అభిరుచి విమర్శ బలహీనంగా కూడా కన్పిస్తోంది.

> (63) ఏ రకమైన కవి? పెద్దకవా? చిన్నకవా?
> అసలు కవేనా? ఇలా అభిరుచికి సంబంధించిన
> విమర్శ బాగా సాగుతోంది. దెబ్బలాడుకోవడం
> వాదనలను త్రిప్పి కొట్టడం మంచిదే, దానికి
> ఏదో ఒక విధమైన పదజాలం ఉండనే ఉంది"

ఈ విధంగా అభిరుచి విమర్శలో చవకబారు నిర్ణయాలనుపేర్కొంటున్నారు. చిన్న కవా? పెద్ద కవా? వంటి విమర్శ వలన ఈ అభిరుచి విమర్శన విధానం నింద్యమౌతోంది.

అభిరుచి విమర్శన విధానం విమర్శకుని అనుభవ ప్రమాణం మీద అధారపడింది. ప్రధానంగా ఒక పద్ధతిలో విమర్శచేస్తున్నా విమర్శకుని అనుభవం ఏదో ఒక రూపంలో అభివ్యక్తమౌతుంది. అందుచే పూర్వనిర్మిత సూత్రాలతో విమర్శచేస్తున్నా. నూత్న లక్షణాలను రూపొందించుకొన్నా విమర్శకుని అభిరుచి ఉంటుంది, కవి ఒక అనుభవానికి రూపాన్ని ఇస్తే, విమర్శకుడు దాని స్వరూప స్వభావాలను విశ్లేషించి విలువకట్టడానికి కవితా స్వాదనచేస్తాడు. ఇక్కడ కవి అవ్యక్త రూపాన్ని ఆస్వాదిస్తే విమర్శకుడు వ్యక్త రూపాన్ని ఆస్వాదించి దాని తత్వాన్ని తెల్పి, విలువకడుతూ తన సృజనాత్మక వైఖరిని ప్రకటిస్తాడు. కవికి విమర్శకునికి ప్రత్యేక దృక్పథాలు ఉంటాయి. ఇద్దరూ వారి వారి రంగాల్లో నవ్యతను తేవాలని ప్రయత్నిస్తారు. అయితే విమర్శకునికి మౌలిక ద్రవ్యం కవిత కనుక తన అభిప్రాయాలను అనుభవాలను వస్తువు నాశ్రయించి చెప్పాలి. ఏ సిద్ధాంతం రూపొందాలన్నా విమర్శకుని దృక్పథమే పరమ ప్రమాణం. కవి, విమర్శకులు వైయక్తిక దృక్పథాలు కలవారైతే, ఇద్దరి అభిరుచులు సంవదించకపోతే విమర్శ

దూషణగా మారుతుంది. అందుచే విమర్శకుడు కవి మార్గాన్ని సంయమ నంతో అవగాహన చేసుకోవాలి.

(64) "ఈ శాఖలో కవి ఎంతటివాడో విమర్శకుడు అంతటివాడు కావచ్చు. ఇరువురికి వారి వారి దృక్పథాలు ఉండవచ్చు. కవియొక్క అభిరుచి విమర్శకుని అభిరుచితో సంవదించకపోతే ఈ విమర్శలో కవి విమర్శకు గురి కావచ్చు. విమర్శకుని దృక్పథమే ఇందులో పరమ ప్రమాణం.

-:సమాప్తం:-



# ఆధారసూచికలు

## సాహిత్య విమర్శ - అభిరుచి


1. Renewellek - Discriminations further concepts of criticism Vivek Publications - New Delhi–1970.

2. Hudson - An Introduction to the study of English literature - George G. Horrap Company - Bombay - 1944.

3. Richards, I. A. - Principles of literary criticism Routledge and keganpal Ltd. London - 1970.

4. Scott Willbur - Five approaches of literary criticism - Macmillon Company Newyork - 1962.

5. లక్ష్మీనారాయణగంగిశెట్టి - సాహిత్య విమర్శ - శాస్త్రస్థాయి- అభ్యుదయ విమర్శ విశేష సంచిక - అరసం.

6. వెంకట సుబ్బయ్య, వల్లంపాటి - ఆధునిక సాహిత్య విమర్శన పద్ధతులు అనుశీలన. హైదరాబాద్ బుక్ట్రస్ట్ 1985

7. Hudson - An Introduction to the study of English literature - George G. Harrap Company - Bombay - 1944.

8. నారాయణరావు, వెల్చేరు - తెలుగు పరిశోధన తీరుతెన్నులు - (అను. రామారావు ఆర్. వి) అభ్యుదయ విమర్శ విశేష సంచిక అరసం.

9. కోటేశ్వరరావు. తమ్మపూడి -సహృదయ తత్వం
అభ్యుదయ (వి. వి.సం.) — అరసం.

10. మందేశ్వరరావు, వడలి - సాహిత్యం - విమర్శ-సమదర్శిని 1884

11. Renewellek — A History of modern criticism—
1750—1950—Jonathor Cape—
London 1955.

12. — The New Encyclopaedia of Britania Vol-V; 15th
edition - The University of
Chicago-1974.

13. Hall Vernon — A short history of literary criticism—
The Merlin Press London-1963.

14. Conner, William Van—Sophistication and Impressio-
nism—An age of criticism 1900-
1950—Honery Regenery .Company
1952.

15. Brijraj Sing—The development of critical tradition
from Pater o yeats-the Macmillan
Company—London—1978.

16. Pateer, Walter—Appresiations.

17. Brijraj Sing — The development of critical tradition
from Pater to yeats—the Macmillan
Company—London 1978.

18. Hall Vernon — A short history of literary criticism —
The Merlin Press—London—1963.

19. Scott Willbur—Five approaches of literary criticism—
Macmillon Company-Newyork—1962.

20. William, Varcornor - An age of criticism-1900-1950
Henry Regeneery Company—
Chicago—1952.

# ఆధునిక సాహిత్య విమర్శ

## అ ధి రు చి

1. Rene wellek & Austin warren — Theory of literature
Page 269

2. నారాయణరావు, వెల్చేరు - పరిశోధన తీరు తెన్నులు
—అభ్యుదయ (వి.ప్ర.సం) అ౭ సం

3. నారాయణాచార్యులు, పుట్టపర్తి—అంధకారయుగంలో సూర్యోదయం
అభ్యుదయ— (వి. ప్ర. సం) అ౮సం

4. కవిత్వవేది— లక్ష్మీకాంతం, పింగళి— తెలుగు విజ్ఞాన సర్వస్వము
తెలుగు భాషాసమితి—మద్రాసు

5. రామలింగారెడ్డి కట్టమంచి—కవిత్వ తత్వవిచారము
ఆంధ్రవిశ్వవిద్యాలయము—1980

6. సంపత్ కుమార్, కోవెల - ఆధునిక సాహిత్య విమర్శ—సంప్రదాయిక రీతి — దక్షిణభారత ప్రెస్ — 1981

7. రామలింగారెడ్డి, కట్టమంచి —కవిత్వతత్వవిచారము—
ఆంధ్ర, విశ్వ — 1980

8. అనంత కృష్ణశర్మ, రాళ్ళపల్లి— సారస్వతావలోకం.

9. రమణారెడ్డి, కె.వి. — కవికోకిల గ్రంథావళి 4 వ భాగం

10. సంపత్కుమార, కోవెల—ఆధునిక సాహిత్య విమర్శ—
సంప్రదాయిక రీతి — దక్షిణభారత ప్రెస్— 1980

11. సత్యనారాయణ, విశ్వనాథ- ప్రసన్నకథా కవితార్థయుక్తి—
సారస్వత వ్యాసములు 1 వ భాగం — ఆం సా. అకాడమి

12. సత్యనారాయణ, విశ్వనాథ — లిరికల్ పొయెట్రి — భారతి అక్టోబరు — 1930

13. సుదర్శనం, ఆర్.ఎస్ — సమాజం సాహిత్యం — చిత్తూరుజిల్లా రచయితల సంఘం — 1972

14. ,, ,, ,, ,,

15. రా. రా. — సారస్వత వివేచన — సంవేదన — 1968

16. చెంచయ్య, వి — ఇటీవలి అభ్యుదయ విమర్శ కొన్ని పెడ ధోరణులు — సృజన – జన — 1980

17. తిలక్ — నవత 3 వ సంచిక — ఏప్రిల్, 1963 — పుట 148

18. సుబ్రహ్మణ్యం జి.వి — శ్రీశ్రీ కవితలో పురాణప్రతీకలు — విమర్శిని — కాకతీయ విశ్వవిద్యాలయం — 1976

19. రంగనాథాచార్యులు, కె.కె — ఆధునిక సాహిత్యంలో విభిన్న ధోరణులు — ఆం.సార. పరిషత్ — 1982

# ఆధునిక సాహిత్య విమర్శ - అభిరుచి ధోరణి

## 1980-1987


1. Spingram J. E. — The new Criticism — The Columbia University Press — New York - 1910·
2. Scott. Wilbur, S. —Argument—Five Approaches of litarary ciiticism — Collier Books Macmillan—New Yourk—1962
3. సంజీవమ్మ, పి— సాహిత్య విమర్శ మార్క్సిస్టు దృక్పథం— అభ్యుదయ (విమర్శ విశేషసంచిక) అ.ర.సం·
4. శేషేంద్ర శర్మ గుంటూరు— ముఖాముఖి. (రచయితతో)-1988
5. సీతారామారావు, పోట్లపల్లి— మహాప్రస్థానం శ్రీశ్రీ కవితా వైభవం— జూన్— భారతి— 84
6. ,, ,, ,, ,, 84
7. రామారావు, చేకూరి — (పీఠిక) ఆధునిక మహాకావ్యం— (నగ్నముని కొయ్యగుర్రం)
8. శ్రీనాథ భారవి — సంకేతకావ్యం కొయ్యగుర్రం - ఆం. ప్రభ. 13-4— 1980
9. కన్నబాబు, దిట్టకవి — సజీవకృతులు — సంజీవదేవ్‌కృతులు తెలుగు విద్యార్థి జన. 1881
10. జిజ్ఞాసి - మినీకవిత ఒక పరిశీలన - సృజన మార్చి 1982.
11. రామారావు, చేకూరి— మార్క్సిస్ట్ విమర్శకులనేవారు కూడా

ఈ ప్రలోభానికి లొంగటం ఆశ్చర్యంగా ఉంది
ఆం. జ్యోతి — 29 — 3 — 87

12. ,, - అక్షర శిల్ప వాదులారా అర్థంచేసుకుంటారా?
ఆం జ్యోతి - 7 — 7 — 87

13. ఇస్మాయిల్ — కవితా విహంగానికి స్వేచ్ఛ ఊపిరి — కవిత్వంలో నిశ్శబ్దం — స్వీయ — 1987

14. కాంతారావు టి.ఎల్. — ఆధునిక సాహిత్యంలో విభిన్న ధోరణులు (సమీక్షా వ్యాసం) — భారతి — జూలై 993

15. తిరుమలరావు, సర్దేశాయి — మిని కవిత మాక్సీ వ్యాఖ్య — భారతి — ఆగస్టు — 1980

16. నారాయణరావు, వెల్చేరు — తెలుగు పరిశోధనల తీరు తెన్నులు — (అను : రామారావు, ఆర్వీ) అభ్యుదయ విమర్శ విశేషసంచిక అరసం

17. శ్రీనాధ భారవి — సంకేతిక కావ్యం కొయ్యగుర్రం — ఆం ప్రభ 13 — 4 — 1980

18. రామమోహనరాయ్ — అరణ్య నేత్రం — ఆం జ్యోతి — 6 — 1 — 80

19. శేషేంద్ర — కవిసేన మేనిఫెస్టో — ఇండియన్ లాంగ్వేజస్ ఫోరమ్ — 1977

20. శ్రీ శ్రీ — శ్రీశ్రీసాహిత్యం — 2 వ భాగం (వచన) పుట 479

21. నారాయణ, వెల్చేరు — చేరా. నారా సంవాదం
ఆం. జ్యోతి — (వార) — 9 — 5 — 86

22. రామారావు, చేకూరి — చే. రా. నారా. సంవాదం
ఆం.జ్యోతి (వార) — 13 — 6 — 86

23. సుబ్రహ్మణ్యం జి.వి — లక్షణసూక్తం — నందిని (త్రైమాసిక) — జూలై 1981

24. వెంకట సుబ్బయ్య, వల్లంపాటి — కథాంశాలు — అనుశీలన
హైదరాబాద్ బుక్ ట్రస్టు — 1985

25. జగన్నాథం, పేర్వారం — ఆధునిక సాహిత్యం అన్వయ క్లిష్టత
— స్రవంతి — మార్చి — 1984

26. శ్రీకాంతశర్మ, ఇంద్రగంటి — సాహిత్య ప్రక్రియగా వచన కవిత
-- ఆలోచన — నవోదయ — 1981

27 రా రా. — మంచిమాట (పీఠిక) (అమ్మంగి వేణుగోపాల్ —
మిణుగురులు 1980

28 గోపాల చక్రవర్తి — రూపవాదం — ఆధునిక తెలుగుసాహిత్యంలో
విభిన్న ధోరణులు ఆం సా. పరిషత్ — 1982

29. రాఘవేంద్రరావు, జె. వి. _ కాల్పనిక వాదం — ఆధునిక తెలుగు
సాహిత్యంలో విభిన్న ధోరణులు —
ఆం.సా. పరిషత్ — 1982

30 శివారెడ్డి — దిగంబర కవుల పొడిగింపు విరసం కాదు
ఉదయం — 15—2—87

31. నగ్నముని— రాజకీయ వాస్తవికత — ప్రజాసామ్య వాస్తవికత —
ఉదయం 11—11_87

32 శివారెడ్డి దిగంబర కవుల పొడిగింపు విరసం కాదు
ఉదయం — 15 — 2 —87

33 రంగారావు, రావి — మినీ కవిత భవిష్యత్తు — విశాలాంధ్ర —
5 — 9 — 82

34 వెంకట సుబ్బారావు, తంగిరాల — ఋతుసంహారం — విశ్వనాథ
వర్ణనా వైశిష్ట్యం — భారతి — జూలై 1980

35 ఇస్మాయిల్ — వైయక్తిక అనుభూతి — సాంఘిక చైతన్యం —
కవిత్వంలో నిశ్శబ్దం — స్వీయ — 1987

36 మూర్తి వై.వి.యస్.యస్.యన్ — ప్రజాకవులు కబీరు, వేమన —
సాహిత్యవ్యాసములు — దేవి — 1984

37 సుబ్రహ్మణ్యం జి. వి. — మఱ్ఱిచెట్టూ — మామిడంట్లూ —
ఆం ప్ర 5 — 6 —1988

38 ఆర్వియార్ — సాహిత్య సిద్ధాంతం — "సాహిత్య తత్వం" —
యుగ సాహితి — 1980

39 ఆర్వియార్ — శ్రీశ్రీలో అలంకారికత — "సాహిత్య తత్వం" —
యుగసాహితి — 1980

40 నారాయణరెడ్డి .సి — యెంకిపాటల్లో కావ్యత్వం — సమీక్షణం —
వంశీ — 1980

41 నరసింహచార్యులు, వేముగంటి — వచన కవితకు లక్షణాలా ?
— భారతి అక్టో — 1980

42 చంద్రశేఖర్. ఎస్జీడి — వచన కవిత కుందుర్తి పాత్ర ఎస్జీడి— 1985

43 రామారావు, చేకూరి — వచన పద్యంలో భావగణాలూ,
పదగణాల రణగోణలా — ఆం జ్యోతి 24 —5 — 1987

44 సుబ్బారాపు, చందూ — వచన కవిత్వంలో లయ
ఆం జ్యోతి — 15 — 5 — 1985

45 రంగారావు, రావి — వచన పద్యంలో పదగభాలు — భారతి
మే — 1990

46 రంగారావు. రావి — ఏది మినీ కవిత — స్పందన-1982

47 సుబ్రహ్మణ్యం, జి వి. — మినీ కవిత — హనీ కవిత -- (తెలుగు
వెలుగులు) ఆం. ప్ర —28_1—85

48 రామమోహనరావు, అద్దేపల్లి — వర్తమాన కవిత్వం భవితవ్యం
ఆం. ప. 3—6—87

49 సోమసుందర్ — రచయితలకు కమిట్‌మెంట్ అవసరమా—
భారతి — జన— 1980

50 రమణారెడ్డి కె.వి-విప్లవ కవులు ముద్ర వేసుకొని ఊరేగడం లేదు
ఆం. ప్రభ 22—2—1987

## ఉపయుక్త గ్రంథాలు

తెలుగు —


1. అర్వియార్-సాహిత్యతత్వం-యుగ సాహితీ - ప్రొద్దుటూరు 1978
2. ఇస్మాయిల్-కవిత్వంలో నిశబ్దం-స్వీయప్రచురణ - కాకినాడ-1987
3. కాంతారావు టి.ఎల్.-సాహిత్యంలో సంప్రదాయం ప్రగతి-తెలుగు విద్యార్థి ప్రచురణలు-మచిలీపట్నం-1983
4. చంద్రశేఖర్ ఎస్జీడి-వచన కవిత్వంలో కుందుర్తిపాత్ర-ఎస్జీడీ - తిరుపతి-1985
5. నారాయణరెడ్డి-సి. సమీక్షణం-వంశీ - హైదరాబాదు - 1981
6. మండేశ్వరరావు, వడలి-సాహిత్య విమర్శ-సమదర్శిని- హైదరాబాదు-1984
7. మూర్తి వై.వి.ఎస్.ఎస్-సాహిత్యవ్యాసములు దేవి - 1984
8. రంగనాథాచార్యులు కె. కె. - తెలుగు సాహిత్యంలో తొలి సమాజ కవులు ఆం. సా. పరిషత్-హైద్రాబాదు-1983
9. నూరేళ్ళ తెలుగునాడు - ,, - 1994
10. తెలుగు సాహిత్యంలో మరో చూపు- ,, - 1982
11. తెలుగు సాహిత్యంలో విభిన్న ధోరణులు - ,, - 1981
12. రామలింగారెడ్డి, కట్టమంచి - కవిత్వతత్వ విచారము - ఆంధ్రవిశ్వవిద్యాలయం-వాల్తేర్ - 1980
13. రంగారావు, రావి-ఏది మిని కవిత - స్పందన-మచిలీపట్నం-1981

14. రామారావు, ఎస్వీ-తెలుగు సాహిత్య విమర్శ అవతరణవికాసములు-
పసిడి-హైదరాబాదు-1974

15. రామమోహనరావు, అద్దేపల్లి -మినీకవిత-ప్రభాకర్-కాకినాడ-1980

16. వెంకట నరసింహం, కాకర్ల -సాహిత్యదర్శనం - క్వాలిటీ -
విజయవాడ-1979

17. వెంకట సుబ్బయ్య వల్లంపాటి - అనుశీలన -
హైదరాబాదు-బుక్ ట్రస్ట్ - 198

18. శ్రీకాంతశర్మ, ఇంద్రగంటి-ఆలోచన - నవోదయ-
విజయవాడ 198

19. సంపత్కుమారాచార్య, కోవెల-ఆధునిక సాహిత్య విమర్శ-
సంప్రదాయకరీతి-స్వీయప్రచురణ-వరంగల్-1980

20. సుదర్శనం, ఆర్.ఎస్. - సాహిత్యంలో దృక్పథాలు —
నవోదయ — విజయవాడ — 1968

21. సోమసుందర్ ఆవంత్స- కృష్ణశాస్త్రి, కవితాత్మ-ఎమెస్కో -
సికింద్రాబాదు-198

22. సుబ్రహ్మణ్యం. జి. వి. - అభినవలోచనం - యువభారతి -
హైదరాబాదు- 1983

23. ,, - ఆంధ్రసాహిత్య విమర్శ - ఆంగ్ల ప్రభావం -
హైదరాబాదు - 1983

24. బ్రహ్మానంద, సి. హెచ్. - తెలుగు సాహిత్య విమర్శ -
పాశ్చాత్య ప్రభావం -
అక్షరప్రసార ప్రచురణ - అనంతపురం - 1984

25. వెంకటరామయ్య తుమ్మల (సంపా) - అభ్యుదయ విమర్శ
విశేష సంచిక) - అరసం

ENGLISH


1. Briiraj Sing-The development of Critical tradition from pater to yeats-the Macmillon company- Newyork-1978
2. DavidDaiehes - Critical approaches to liteerature Orient longman - Bombay -1973
3. Eliot T. S. The Sacred wood - Frroys in poetory and criticism - Mattew & compary Ltd- II new fetter lane - London - 1969 II ed
4. Forter, Richard - The new exmartics Ariapprisal of the new criticism - Indian Univer- Press - Bloomington - 1962.
5. Hudson, William Henry - An Introduction to the Study of literature - George G Harap Company Ltd. - Bombay-1944
6. Peacock. R - Cricism and personal taste - Clarendon press - Oxford - 1972
7. Scott Wilbur - S - Five approaches of literary criticism- Collier Books-Macmillon Publishing Company-Newyork-1962
8 Spingarn J. E. - The new criticism - the Columbia University Press - Newyork 1910
9. Van Cannor, Wiilian - An age of Criticism 1900-1950 Herory regerery Company - Chicago-1952.
10. Vernon Hall - A short history of literary crlticism - The Merli on Press-London-1963.
11 Richards, I. A. Prirciples of literary criticism Routledge and Kegarpal Ltd. London - 1970
12. Wellek, Rene A - history of modern criticism (1750-1950) Vol. V The Twentieh Century - Jorathan Cape - London 1970
,, Discrimirations furhter concepts of criticism - Vikas Publications - Delhi - 1970.
14. ,, The attack on literature and other essays - The Harvesteer Press-Brighton-susser-1982-

